# [illegible]

గ్రంథకర్త

స్వర్ణమయి, మధుపానము, ఆయేషా, జీవితసమరము, మొదలగు

గ్రంథములను రచించిన.

శ్రీ అయ్యగారి బాపిరాజ శర్మ.

(పండిత వేమవరం)

మహారాజశ్రీ పైడా చినరామక్రిష్ణయ్యగారు జమీందారు
అండ్ బ్యాంకరు కాకినాడ వారి ద్రవ్యసహాయమున యీగ్రంథము
అచ్చొత్తింప బడినది



మొదటికూర్పు 1000 ప్రతులు.

1 మొదలు 80 పేజీవరకు రాజమండ్రి దేశబంధు ప్రెస్ యందును.
టైటిలు సాంగ్సు కృతిసమర్పణము వగైరా రాజమండ్రి
శ్రీ కృష్ణాముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

1929.

 [వెల 1—0—0

B

# ఇందలి పాత్రలు.

## పురుషులు.

కుసుమ గుప్తుడు—కన్యక తండ్రి.

భాస్కరాచార్య—వైశ్యగురువు.

విష్ణువర్ధన } రాజు.<br>
రాయబారి }

సోమగుప్త } సభ్యులు.<br>
విశ్వగుప్త }

నారద.

శంకర.

కరంటక } రాజహితులు.<br>
విభీతక }

## స్త్రీలు.

కన్యక—కథానాయిక.

# హెచ్చరిక.

నా వ్రాతమూలకమగు యనుమతిలేనిదే యీనాటకము నెవ్వరును ప్రదర్శింపరాదు. నష్టమునకు బాధ్యులగుదురు.

అ॥ బా॥ శర్మ.

గ్రంథకర్త

# ప్రస్తావన.

మానరక్షణార్థమేగాక ధర్మప్రతిష్ఠాపనార్థమును ప్రాణముల నగ్నిదేవుని కాహుతియొసంగి వైశ్యసంఘముయొక్క ఆత్మగౌరవమును శాశ్వతముగ స్థాపించి వీరవనితయని పేరొంది రాణీసంయుక్తాది రసపుత్ర నారీమణులవలె కులమునకును, మతమునకును, మాతృభూమికిని స్థిరమగు నిర్మలయశస్సునగూర్చిన సుప్రసిద్ధ కన్యారత్నమగు వాసవి యొక్క పవిత్రచారిత్రమే యీనాటకమునందలి కథాభాగము. నిరంతర శంకర భగవత్పాదారవింద పూజాతత్పరయు పరమేశ్వరుని యర్ధాంగియు నగు పార్వతియే భూలోకమున కన్యకగా నవతరించెను.

వివిధరత్నప్రభావిభ్రాజితంబులై దనరారు సౌధనివాసినియై రాజ్మహేంద్రనగరాధీశ్వరుని యర్ధాంగియై పట్టమహిషియగుటకంటె త్రికరణంబులు మీరశంకరభగవానునే హృదయేశునిగ వరించిన సాధ్వీలలామ కన్యక.

వీరరసప్రధానమై, చారిత్రాత్మకమగు నీనాటకము కడు రసవంతముగను మృదుమధురశైలిని రచియింపబడినది. తక్కిననాటములవలెగాక యిది నిజమగు దృశ్యప్రబంధములకుండవలసిన లక్షణములుగలిగి పాత్రౌచిత్యమునందును, పాత్రపోషణమునందును, శౌర్యప్రదర్శనంబునందును అద్వితీయమై యొప్పుచున్నది.

రాజ్మహేంద్రవరరాజ్యరమాధీశ్వరుడగు విష్ణువర్ధనమహారాజు యొక్క హృదయఫలకమునందు మూర్తీభవించి ప్రేమసాగరంబున ముంపజేయు సౌందర్యలలామయగు కన్యకయొక్క వయస్సు నారువత్సరములకు లోపుగనుండజాలదనియెంచవలసియున్నది. రమణీయ వాక్సుధారసధారాలోలుడునట్టియు, శీతలసారములమించు కందోయి

తోడను, గండుతుమ్మెదల హసియించు వేణీభరంబుచేను, స్తనభారమున నసియాడు తనువల్లితోడను విరాజిల్లు సౌందర్యసీమయగు కన్యక రజస్వలకానిబాలయని యెవ్వరనసాహసింతురు. చరిత్రాత్మకమైన యీ సాధ్వీలలామ యుదంతమువలన వైశ్యులలోగూడ రజస్వలానంతర వివాహములే పూర్వకాలమున నాచరణలోనున్నట్లు స్పష్టమగుచున్నది.

పౌరుషమే ప్రధానముగ దేశపాలనమే ముఖ్యాశయముగ ధర్మసంరక్షణమే జీవనాధారముగ నెంచి ఆసేతుహిమాచలపర్యంతము భారతీయ సామ్రాజ్యలక్ష్మి నేకచ్ఛత్రాధిపత్యముగ నేలియు మరుగుపడియున్న గుప్తవంశపవిత్రచారిత్రకు వన్నెబెట్టునీ నాటకరాజము నాంధ్రులెల్లరును ముఖ్యముగా వైశ్యులెల్లరును సాదరముగ బఠింపెదరుగాక.

లోకోత్తరనాయికయు భారతనారీమణులకెల్ల నాదర్శప్రాయయునగు కన్యకయొక్క పవిత్రచారిత్ర మాచంద్రతారార్కముగ నుండునటుల దృశ్యప్రబంధమురచించి వైశ్యులయొక్క పౌరుషప్రతాపములను గుప్తసామ్రాజ్యపు దివ్యకీర్తిని చిరస్థాయిగ నొనర్చిన యీగ్రంథకర్తను వైశ్యులెల్లరు నభిమానపూర్వకముగ నాదరించెదరుగాక.

సుప్రసిద్ధ జ్యోతిష్కులును, అసమాన సాముద్రిక శాస్త్రవేత్తలును, కవీశ్వరులును అగు బ్రహ్మశ్రీ అయ్యగారి బాపిరాజశర్మగారి కవిత్వప్రౌఢిమయు, భాషాసరళియు, పాత్రపోషణమును, చారిత్రాత్మక విషాదాంతనాటక కథాసమన్వయ చతురతయు, ప్రసంశార్హములు. యిట్టి ప్రజ్ఞావంతులగు గ్రంథకర్తగారిని ఆంధ్రులెల్లరును ముఖ్యముగా వైశ్యులును ఆదరసన్మానముల గాపించి యింకను యిట్టి యుత్కృష్ట గ్రంథములను వ్రాయుటకు ప్రోత్సహించెదరుగాకయని కోరుచున్నాను.

రాజమండ్రి,
10 మేయి 1929.

మాజేటి మునెయ్య B.A.B.L.
హైకోర్టు అడ్వొకేటు
కార్యదర్శి, వైశ్యసేవాసదనము.

# కన్యక - కృతిపతి.

ఈ కృతికన్యకను—కాకినాడపుర వాస్తవ్యులును, వైశ్యకులోద్భవులును పైడా వంశార్ణవరాకాసుధాకరులును, మూర్ఖసగోత్ర పవిత్రులునగు రావుబహదూర్ వెంకటచలపతి జమీందారు (అన్నదేవరపేట, పక్కిలంక, వగైరా) గారికి, ప్రేమపూర్వకముగా సమర్పించుచున్నాను.

# కృతిపతివంశానువర్ణనము.

తండ్రి తాతలనుండియు ననేక సత్కార్యములచే వాసిగాంచి, దేశమున నెనలేని ప్రఖ్యాతిగడించిన పైడా వంశోద్భవులు నాకృతిపతి యగుటకెంతయుకృతార్థుడను. ధర్మకార్యనిర్వహణంబున నసమానంబగు కీర్తినార్జించిన నాకృతిపతులగు జమీందారుగారి కులమును, యశమును, పాఠకులకుదెలిపి నాయానందమును వ్యక్తీకరింపవలసియున్నది.

తండ్రిగారగు పైడా రామకృష్ణయ్యగారును, పెదతండ్రిగారగు పైడా వెంకన్నగారును, అనేక ధర్మకార్యములాచరించి తుదకు చిరస్థాయిగా నుండునట్లు ద్రాక్షారామభీమేశ్వరుని సన్నిధానముననే ధర్మసత్రము నిర్మించి కృతార్థులైనారు. జననియగు వెంకమాంబగారు కాశీలో విద్యార్థులకొరకు రాత్రిభోజనవసతి నేర్పరచి సత్రనిర్మాణము గావించిన ధన్యాత్మురాలు! అట్టిమహాకీర్తిశాలురును, ధర్మమూర్తులునగు వెంకమాంబా రామకృష్ణయ్యగారి తృతీయపుత్రుడే మాకృతిభర్త! ఇక మాకృతిపతియో?—

కాకినాడపురంబున ప్రజోపయోగకరముగ, 'వెంకటచలపతి పురమందిరము' నిర్మించి, వైశ్యప్రముఖులనందరను ప్రోత్సహించి

శ్రీకన్యకా పరమేశ్వరీ ఆలయనిర్మాణమునందు ప్రధానస్థానము నలంకరించి ఆయాలయమును నిర్మింపజేసి, విద్యార్థులకు కాకినాడకాలేజీలో కొన్నిభవనములను కట్టించియిచ్చి, స్త్రీలకు ప్రత్యేకవిశ్రాంతికొరకు 'Ladies recreation Club' అనుపేరిట నొక విశ్రాంతి భవనమును కట్టించియిచ్చి, వేదపాఠశాలస్థాపించి మనమతోద్ధరణకు కేలూతనొసగి, ఆపురముననే శ్రీవేణుగోపాలస్వామివారి ఆలయముకట్టించి, ఆయుర్వేదాశ్రమమొకటి స్థాపించి, జ్యేష్ఠసోదరులగు సుబ్బరాయుడుగారు చలమయ్యగార్ల సహాయంబున కాకినాడపురంబునందుజను లాబాలగోపాలము చిరతరంబుగ స్మరించునట్లు వారికి నీటిసదుపాయము (Coconada Water Works) గావించి, అన్నదేవరపేట ప్రక్కిలంకమొదలగు జమీాల కధీశుడై, రజితతులాభారంబున షష్టిపూర్తి యుత్సవముసలిపి, బీదసాదల కనేక వస్త్రద్రవ్యాదికంబులగు దానధర్మములుజేసిన రావుబహదూర్ పైడా వేంకటచలపతి జమీాందారుగారే మాకృతిభర్త! కాకినాడలో నొకసత్రముకట్టించి పైనన్నిసత్రములందును భోజనవసతులనేర్పరచిన సాధ్వీరత్నమగు సౌభాగ్యవతి సత్యరాజమ్మమె యీమహామహుని యర్థాంగి! బంగారమునకు తావియబ్బినది. కీర్తిశేషురాలైన యీమహాసాధ్వికి భగవంతుడు పుణ్యలోకముల నొసంగుగాక!

ఈపుణ్యాత్ముని, ఈధర్మమూర్తిని, ఈగుప్తనాయకుని, ఈకృతిపతిని భగవంతుడు రక్షించుగాక!

మరియు నీముద్రణకు వలయు ద్రవ్యమునొసంగి, నాకుమిక్కుటముగ ప్రోత్సాహమిచ్చిన శ్రీపైడా చినరామకృష్ణయ్య జమీాందారుగారికేనెంతయు కృతజ్ఞుడను.

# కృతజ్ఞత.

మొదటినుండియు నీపాత్రమును వ్రాయుటకు నాకుకడు ప్రోత్సాహమొసగి, అందులకువలయు సాధనసంపత్తిని సమకూర్చి, నాకు సమస్తవిధముల సహాయముచేసిన వైశ్యోత్తములును, నాస్నేహితులును, తూర్పుగోదావరిజిల్లా అమలాపురం వాస్తవ్యులగు అత్యాం పద్మనాభంగారికిని వారిసోదరుడగు విశ్వనాధముగారికి నేనెంతయు కృతజ్ఞుడను. ఇట్టి సదుద్దేశమును నాకుగలిగించిన ఆ అత్యముసోదరులకు భగవంతుడఖిల సౌఖ్య సంపద-లందజేయుగాక!

పండిత వేమవరం
ఆచంటపోస్టు,
West Godavari

అయ్యగారి బాపిరాజశర్మ,
గ్రంథకర్త.

# నాంది.

ధర్మరక్షణ, భక్తి వా • త్సల్యమహిమ
మతివిచారణదలచి యి • మ్మహినివైశ్య
వంశమునబుట్టుశాంకరి • బహుళసౌఖ్య
ములనొసంగి సదస్యుల • బ్రోచుగాత!

సూత్రి:—[ప్రవేశించి.] నటీ! నటీ!

నటి:—[ప్రవేశించి] నాథా! ఏమిశెలవు?

సూత్రి:—సభ్యులు వేచియున్నారు. కావున బ్రహ్మశ్రీ అయ్యగారి బాపిరాజశర్మచే రచియింపబడిన కన్యకయను నాటకమును మనమిప్పుడే ప్రదర్శింప వలయును.

నటి:—నాథా! ప్రదర్శనమున కన్నియు సర్వసిద్ధముగా నున్నవి.

సూత్రి:—వైశ్యధర్మంబులను, గుప్తచారిత్రము, కన్యకయను గుప్త వీరవనిత వృత్తాంత మిందు వీరరసభూయిష్టముగ వ్రాయబడినది మరియు దీని కృతిపతి——

సీ॥ తనదానధర్మంబు ♦ లనునెంచినిరతంబు
కడుమోదమున నర్థి ♦ గణముదలుప
తనమన్ననలగాంచి ♦ తనువులుపులకింప
సత్కవిబృందంబు ♦ సంతసింప
తనసద్గుణావళి ♦ దలపోసిసరివారు
సిగ్గునమదిలోన ♦ చింతసేయ
తనదైవభక్తిపై ♦ స్థిరతనులోకంబు
మించి యాపుణ్యు కీ ♦ ర్తించుచుండ.

గీ॥ విమలమూర్ఘసగోత్ర ప ♦ విత్రుఁడగుచు
రామకృష్ణయ్య వేంకమ ♦ రమ్యదంప
తులకు ముద్దులపుత్రుఁడై ♦ చెలువుమీఱ
పైడవేంకటచలపతి ♦ భవ్యుఁడలరు!

గీ॥ వృక్కలంకయు, నన్నదే ♦ వరపుపేట
లాదిపురములకధిపతి ♦ మోదమార
రావుబహదూరు బిరుదు తా ♦ రహిఁగడించె
నతనికాయువు, భాగ్యంబు ♦ లమరుఁగాత!

ఆజమీఁదారుఁడే—ఆవైశ్యశేఖరుఁడే—ఆవేంకటచలపతియే—యీకృతి నందుకొనియె! మరియు నాతని కనిష్ఠపుత్రుఁడగు చినరామకృష్ణయ్య ఈకృతికి ముద్రణకువలయు విత్తమునొసఁగి ప్రోత్సహించె! వారలను భగవంతుఁడు రక్షించుగాక!

నటి:—నాథా! ఆనందమైనది. (ఉలికిపడి) అదిగో! విష్ణువర్ధనుచే పరిభవింపబడిన కన్యక రోషముతో యిటులనేవచ్చుచున్నది. పోదము రమ్ము నాథా! (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.



# కన్యక



## ప్రథమాంకము.

రంగము: శయనమందిరము.

ప్రవేశము: కన్యక పూలసెజ్జతో.

కన్య:— (రోషముతో)

సీ. అన్యభామలఁగోర నతిపాపమనిలోన
నించుకయును భీతి గాంచలేదు;
వాంఛించు లలితాంగి వరణీయయో కాదో
తనకంచు నింతయుఁ దలపలేదు;
హితభావమున దుష్టమతము నెంచుటకూడ
దనియైన సంకోచ మందలేదు;
తనవంటి రారాజు ధర్మంబు విడనాడ
నిలకరిష్టమటంచు నెంచలేదు;

గీ. హా! యీతఁడు మిగుల కామాంధుఁడగుచు
నన్ను దరియంగఁజేరి తా నెన్నొ కలుష
భాషణములాడె; నగ్నిని ఘనమటంచు
భక్షణము సేయఁజను శలభంబుగతిని.

(విసుగు) ప్రతియక్షరమునను నిరసనభావము ధ్వనించుచున్నది. ప్రతివాక్యమునందును స్వకులౌచిత్యంబును, అన్యకులనీచత్వంబును ఘోషించుచున్నది ప్రతియాంగికమునందును, అహంభావము తాండ

వించుచున్నవి. ఏపాపచింతనమును లేక, స్వకులోచిత ధర్మనిర్వహణ విధానంబున కాలంబుగడపు నాకీపరాభవము కడుంగడు దుస్సహము. ఈపరాభవ కీలికీలికా నివహంబులు మదీయహృదయంబును దహింపఁ జేయుచున్నవి! రాజగుఁగాక! రాజరాజేశ్వరుండగుఁగాక! రాక్షసమా తనికి న్యాయమాఁగాక!- చూచినమాత్రంబుననే ప్రేమించి, కులానుచితవివక్షత నరయక, రాక్షసకృత్యం బుపయోగించు నీతఁడు రాజ్యార్హుఁడా? అన్యకులజనను చింతలేక అభిమానవతినను తలంపైనను అరయక నామానధనంబుల నపహరింప నీవిష్ణువర్ధనునకింత సాహసమేలకో! భావరహితనై స్వేచ్ఛావిహారిణినై పరార్థములచేఁ బ్రకాశించు వెలయాలిఁకైవడి నన్నీతఁడు భావించి యేవిధముగానైనను తనస్వాధీనము గావించుకొనఁదలంచియుండెను కాఁబోలును! కాని, నిరంతరశంకర భగవత్పాదారవిందయుగ చింతనామృతపానమత్తచిత్తనగు నొక మానవతిననని నన్నీతఁ డెరింగియుండలేదు పుట్టినదాది యైహికేచ్ఛవదలి కేవలమాశంకరునే ప్రేమించియుంటినని ఈతఁ డెరుంగఁడు కాఁబోలు! ఈతఁడా? నాయభిమానధనంబులను హరించుటయా! అసంభవము. హాశంకరా! [ప్రార్థించును.]

( శంకరునిలకనుపించును.)

హాశంకరా! మదీయమనోహరా! భవదీయచరణంబులనాశ్రయించుకొన్న నన్నీవిపదంబుధినుండి నుద్ధరింపరావా? ఈవిష్ణువర్ధనుని దృష్టిపథమునుండి నన్నుద్ధరింపరావా? [పాదములబట్టికొనబోవును. శంకరుడదృశ్యుడగును. కన్యకవిభ్రాంతితో] నేనిట్లు చిత్తవిభ్రమమునొందుచుంటినేలకో! అయ్యో! ప్రస్తుతకార్యవిచారణ మేమియో తెలియదయ్యెకదా!

ఏమిచేయుదు? హృదయంబును జంపికొని, హృదయభావముల నశింపజేసికొని, యభిమానధనంబును వీడి ఆవిష్ణువర్ధను మాయాహా

గురంజిక్కితినా! తరతరంబులనుండియు నిష్కళంకపూర్ణశశికాంతులం ధిఃకరించు మావైశ్యకులయశంబంతరించు వైశ్యరాజనిర్నిద్రప్రతాపానలంబునకు జలముభంగినగుదు. కాకున్న, రాజాభిప్రాయంబున కంగీకరింపకుందునా, కేవలము సత్వగుణమునే ప్రధానముగ స్వచ్ఛందజీవనము చేయు మావైశ్యకులంబును రూపుమాపిన దానవగుదు. రాజవినీతుండు. బలవంతుండు అన్యకులజను, అభిమానవతిని, వైశ్యప్రతినిధి ముద్దుకూతురను, నన్నే పరిగ్రహింపనెంచిన యాతండెట్టి దుష్కార్యమునకును వెనుదీయఁడు. నేనాతనికి లభింపలేదను క్రోధంబున, మావైశ్యసంఘంబులకాతండెట్టి యకృత్య మొనరించునో కదా! ఆహా! ఏటులైనను నాకిది గండముగనేయున్నది. ఏమిచేయుటకును తోఁచదు. ఏది యొనరించినను ప్రమాదముగనే గాన్పించుచున్నది. కట్టా!

సీ॥ తేరిచూడఁగరాక దేదీప్యమానమౌ
మహితయశంబునే మాపఁజాల;
కోమటైనమాగుప్తకులమునాశనమంద
గాఁగన్నులను నేను గాంచఁజాల;
మహి, వైశ్యకులములో మణిభూషణమువోలె
వెలుగొందుమానంబు వీడఁజాల;
అభిమానభాగ్యము నర్పించి జగతిని
మోదంబుతో నేను మురియఁజాల

గీ. ఏమి సేయుదాన ఎంతని విలపించు
దాననింక యేది దారినాకు
పుడమి నేలయాఁడు పుట్టువు గల్పించె
బ్రహ్మ యిట్టిపాడు బ్రతుకుబ్రతుక!

అక్కటా! పర రాజుపురమున విడిసియుండెనని యైనవలపక నేనిప్పుడేల యుద్యానమునకు బోయితి! పోయితిబో నాచెలికత్తెలకు

వీచిపుష్పోపచయమున కొంటిగా నేలవెడలితి! వెడలితిబో నాసమీపసరోవరతటంబున గూర్చున్న ఆరాజవసునిజూచియు పరపురుషావలోకనంబునసే నేలవెంటనే మరలనైతి! ఆరాజునన్నుగాంచి కలుషమానసంబున సమీపించి మోహాయత్తచిత్తంబున నేలకలుకరింపవలసె? పుష్పగుళుచ్ఛంబులమాటునడాగియున్న క్రూరవిషోరగముభంగి చంద్రచంద్రికానివహంబుల మ్రింగజూచు దుష్టరాహుగ్రహముభంగి, యారాజునన్నేలకామించి పరుషభాషణంబుల నావీనులవైచె? ఎన్నివిధముల తగదని ప్రార్థించినను వినక తన్ను వివాహమాడుమనియు రాజులకు రాక్షసము నైజమనియు నేనంగీకరించినను లేకపోయినను యేవిధముగానైన నన్ను పరిగ్రహించియే తీరుదునని యాతడు ప్రతినబూనె కదా!

అక్కటా! నిరాకరించి వచ్చెనను తలంపున, చురచుర నావైపు జూచి, క్రోధఘూర్ణిత మానంబున పలికిన యాపలుకులు- అక్కటా! నాచెవులకు ములుకులుగాఁ బరిణమిల్లినవి. అయ్యయ్యో! సామదానభేద దండోపాయంబుల నెట్టులైన నన్నుపరిగ్రహించియే తీరుదుననియాతఁడుపలికెఁగదా! ప్రళయకాల కీలికీలికాని చయంబుల గ్రుమ్మరించు యక్షర సంయుతంబగు నీవాక్యంబులనే సహింపగలనా?

[కోపము] ఓవిష్ణువర్ధనా! నీవునన్ను బడయఁజాలవు నీవంటి చతుస్సహస్ర సంఖ్యానీకంబులగు విష్ణువర్ధనులేతెంచినను నాకాలివ్రేలిని స్పృశింపఁజాలరు. కానిమ్ము నీబలమేవిజయమందునో లేకనిష్కళంకమగు మాధర్మమేవిజయమందునో చూచెదను. పన్నికొనుము నీయిష్టము వచ్చినన్నికుతంత్రముల- ఉపయోగింపుము నీసకలబలమును- ప్రయోగింపుము నీసర్వప్రపంచమును మోహవిభ్రాంతిని ముంపజాలు నైంద్రజాలముల- కాని- కాని- నీవునన్ను బడయజాలవు ఇది విధిలిఖితము. మాపురంబు ముట్టడించి, మమ్ములఁబట్టి మా వైశ్యసంఘంబులనెల్ల తల

లనరికించి నన్ను చిత్రవధగావించినను నేనునీకు స్వాధీనసగుట అసత్యము. తరతరంబులనుండియు ప్రకాశించు మాగుప్తకులము పశౌన్నత్యంబును ప్రకటించు పసయుమురుడించినది. పౌరుషమే ప్రధానముగ, దేశపాలనమే ముఖ్యాశయముగ, ధర్మసంరక్షణమే జీవనాధారముగా నెంచి. ఆసేతుహిమాచలపర్యంత మీహిందూదేశ మహాసామ్రాజ్యలక్ష్మి నేకచ్ఛత్రాధిపత్యముగా నేలియు మరుగుపడియున్న మాగుప్త పవిత్రచారిత్రకు వన్నెబెట్టెదగాక!

(విచారము) అయ్యో! ఈమార్గము తప్పదు. ఇందువలన నేను మరణించుటయేగాక మావైశ్యసంఘంబులెల్ల నశించునుకదా! నేను మరణించిన సంతోషమున మరణింతునుకాని నాచేతులార నీవైశ్యకులమును రూపుమాపఁజేయుదునా? నామూలమున నీగుప్తకులమహార్ణవంబున హాలాహలము కల్పింపఁబడుచుండెఁగదా? అకటా! నేనేపాపిని- నేనేవైశ్యకులాంతిమ విషాదనాటకప్రదర్శకను- నేనేసకలగుప్తధర్మ మహాసామ్రాజ్య వినాశనంబునకై జన్మించిన పనుముసలమును- అయ్యయ్యో నాకేలచావు రాదు? నన్నేల నీపంచభూతములును కరుణింపవలె!

ఓసకలప్రపంచనాశనకర ప్రళయకాలాగ్ని కీలికాసమూహంబులారా! మీరు నన్నేల కాల్చి భస్మముచేయకున్నారు? ఓచండతరక్రోధాభిమాన ప్రపూర్ణోజ్వల ప్రభాభాసురమగు నోకన్యకహృదయమా! నీవేల వ్రక్కలై యీస్వల్పమగు ప్రాణమును గొనిపోకున్నావు? ఓదైవములారా! మీరెటకేగినారు? మీరైన నాకు తోడుపడరే! ఓగుప్తకులప్రముఖులారా! ఓగుప్తయశస్సామ్రాజ్యమా! ఓగుప్తసనాతన శౌర్యసాహసములారా! మీకు కనికరము నశించెనా? ఓదుఃఖభాగినీ!

కన్యకా:—హాపరమేశ్వరా! శంకరా!— (మూర్ఛిల్లును)

పరివేశము—కుసుమగుప్తుడు

కుసు:—(తనలో)

గీ. వైశ్యకుల సాంప్రదాయంబు వదలివైచి
వైశ్యధర్మంబులనుమంట బడగవిడచి
వైశ్యయశమెల్లశిథిలమై బరగుచుండ
వైశ్యులెల్లాడుచున్నారు వసుధనేడు.

మరియు—

గీ. వేదశాస్త్రోక్తసంవిధి వెడలిపోయె
ఉపనిషద్వాక్యసరణియెం దోనశించె
నిర్మలంబైనసదయశో నియతిచనియె
కటకటా! వైశ్యసంపత్తి గాలిలునిటుల.

(కన్యకనుజూచి) బిడ్డా! బిడ్డా! ఇదేమి? ఏల ఈరీతిని దుఃఖాకులచిత్తవై మూర్ఛిల్లియున్నావు? నిరంతరదరహాసభాసురంబగునీముద్దుమొగము ముకుళింపనేల? నీకెవ్వరైనపచారముగావించినారలా? వచింపుము. నీవిట్లుదుఃఖిల్లనేల? వైశ్యనాయకుని ముద్దులకుమారైవగు నీకపచారమునెంచిన యాదుష్టాత్ము డెవ్వడు? బలుకవేమి? నీవిట్లువిషాదచేతస్కవైమమ్మునెల్లర దుఃఖవారాసిలోముంచెదవే! బిడ్డా!—

సీ. హంసతూలికనైన అలతజెందెడిమేను
కటికినేలనుమూర్ఛ గాంచనేల?
కన్నీరుమున్నీరు గాచెక్కిళులజార
వదనబింబంబిట్లు వాడనేల?
కడునునోజ్ఞంబైన వెడదవేనలివీడి
శిరమునసనిటునటు చెదరనేల?
లలితంబులౌప్రియో క్తులనాడునెమ్మోవి
చిలుకపల్కులనేడు పలుకదేల?

గీ. పుత్రి; ననుగన్నపుత్రి; నా పుత్రి; నాదు
పాపమో! దోసమో? లేక పరులకృత్య
మో? వచింపగరాదొకో మోసమేమొ?
అయ్యొ! వచియింపవేలనీ యార్తిపుత్రీ!

కన్య:—(లేచి) తండ్రీ! ఏమనివచింతును? ఏమివచింతును ఏమియును లేదు.

కుసు:—అయిన నీవీవిధమున దుఃఖించుచు భూమిన్ వ్రాలి శోకిల్ల నేల? సర్వశోభాయమానంబులగు నీయలంకారము లీరీతిచెదరియుండ నేల? ఈకన్నీటి ధారలేల? వచియింపుము. కుమారీ! నీకపచారము దలపెట్టిన యాతడెవ్వడైనను, ఈకుసుమగుప్తుని యాగ్రహానలంబున కింధనమై సమయగలడు. తనయా! వచింపుము నీశోకకారణము—

కన్య.—జనకా! ఇందునాకోట వచింపదగినదియునీవు వినతగినదియు నేమియు లేదు.

కుసు—మరి యీవిచారమో?

కన్య—అదియొక తాత్కాలిక మనోవికారము.

కుసు—అటులకాదు. నీహృదయమేదియో దుస్సహదురంత చింతాపరిపీడితమై యున్నదని నాకు దోచుచున్నది. ఇందసత్యములేదు. కుమారీ! బల్కుము. నీప్రియజనకు నీవిధమున సంతాపావస్థలో విడచుటపాడికాదు

కన్య—సన్నేల నిర్బంధించెదవుజనకా! నేనొకవేళ నాసంతాప కారణమును నీకెరింగించినను, దానివలనకలుగులాభమేమి? నాకపచారముదలపోసినయాతడు మనచే సాధింపబడు వాడు కాడనియేదలంచి, నేనిదివరకే కృతనిశ్చయనై యుంటిని.

కుసు—నీకపచారము దలపెట్టినయాతడు నాకంటె బలాధికుడైన నగుగాక! అతడు నాకు-నాధర్మమునకు- నాసత్యపాలనంబునకు

బద్ధుఁడనియే విశ్వసింపుము వచింపుము వారెవ్వరో? మరియు కృత నిశ్చితనైతి నంటివి. ఏమి నిశ్చయించుకొంటివి?

కన్య—ప్రాణ పరిత్యాగమును.

కుసు—ఆఁ! నే జీవములతో నుండియుండగనే? వలదువలదు. నీ సంతాపకారణమును నా కెఱింగించిన పిదప, నేనీ విషయమున వ్యర్థుఁడనని నీకు దోచినచో ధర్మయుక్తమయిన యెడల నీవా కార్యము నొనరింపవచ్చును. వచింపుము?

కన్య—అట్లైన వినుము. నేటి యుదయమున యథారీతి శంకర పూజాతత్పర నయి, పుష్పంబులకొఱ కుద్యానమున కేగితి.

కుసు—ఒంటిగానా?

కన్య—చెలులతోడనే కాని వనమునచెలుల నొక్కచో విడచి దూరముగాపోయి పువ్వులఁగోయుచుంటిని.

కుసు—బాగుగా నేయున్నది.

కన్య—నాసమీప సరోవరతటంబున నొక పూరుషుఁడు కూరుచుండి, నన్నవలోకించి, వెంటనే నాసమీపమునకువచ్చి నిలుచుండెను.

కుసు—ఆతఁ డంత సాహసించెనా? ఓరీ! మూఢా!

గీ. ఎవడవురనీవు? దుర్మార్గ మెదనుదలఁచి
కామినులనొంటిగాఁజేరఁ గడగినావు?-
తలకుపొగరెక్కెనో? నాదు తనయ యంచు
నెఱుగవో! చూడుమింకనీ యెగురడంతు.

వాని నామధేయము?

కన్య—అటుల సమీపించి, తాను రాణ్మహేంద్రి రాజ్యాధినాథుండగు విష్ణువర్ధనమహారాజుననియు, తన్ను నే వివాహమాడవలయుననియు, నిర్భయముగా వచించె. జనకా! నే నేమియు మాఱుబలుకక వెడలివచ్చుచుంటిని. కాని,-

కుసు—[చెవులుమూసికొని] శివశివా! ఇంక వినఁజాల—తెలిసినది. ఓవిష్ణువర్ధనా! ఎంత హీనకృత్య మాచరించితివి ?

మ. అరరే! ఎంతటి హీనకృత్యమిది; శు
ద్ధాంతంబునందున్న సుం
దరులన్ గాంచి విరాళిఁజెంద కడునిం
ద్యంబద్దియౌ కాదె? రా
జ్యరమాకాంతునకిద్ది శ్రీయమొకో? యో
గ్యంబే! కులంబొప్పునే!
పరిహాసంబొనరింపరే సుజనులీ
భావంబు యోచింపగన్.

కన్య:—నేను వాని మాటల నాలింపక మరలివచ్చుచుండ తానేరీతిగానైన నన్నుద్వాహమాడక మాననియు, రాజులకు రాక్షసము న్యాయమనియు, ప్రస్తుతము నేనేగినను చతురుపాయంబుల తాను నన్ను బడయక మాననియు, పరుషభాషణంబులాడెను. కావున జనకా—

చ. జనపతి నన్ను చేరఁగొనఁ
జాలడు; నిక్కము; గాకపోయినన్
తునియలు జేయు వైశ్యులను
దుష్టత నేలభియింపకుండుటన్
జనపతియో, మరేనో, యిట
చావతొలంగునరిష్ట మియ్యెడన్
జనపతిచావనెట్లు ? మరి
చావగనాకునను జ్ఞనీయుమా!

[నమస్కరించును.]

కుసు:—(చెవులుమూసికొని] అమంగళము ప్రతిహతమగు గాక! ఎట్టి సంతాపకరవాక్యంబుల వినవలసివచ్చెనకె. ముద్దులపట్టీ భయమునొందకుము. ఈబాంధవ్యము ధర్మవిరుద్ధమని యాతనికి దెలియబరచిన నాతడంగీకరించి వెడలిపోవును వలనన—

గీ. వైశ్యజవునీవు; క్షత్రియ వరుడు తాను;
మనకు వానికి మతమున మైత్రిపొరదు
భిన్నవర్ణపుబాంధవ్య మున్నదగరె?
వర్ణసంకరమన నసంభవము నేడు?

అటుగాక, ఈవిష్ణువర్ధనుడు మత్కారత్వము నుపయోగింప నెంచెనా.

గీ. ఇట్టివేయిరాజు లిరువదివేవురు
రాజరాజులైన రమణి నీదు
కాలిగోటినైన గాంచలేరింక నీ
బహుగువర్ధనుండె జట్టువాడు?

పుత్రీ! ఇంతమాత్రమునకు వగవం బనిలేదు. కర్తవ్యమునిప్పుడే యోచించెదను

ప్రవేశము: భాస్కరాచార్య.

భాస్క:—వైశ్యశేఖరా! జరిగిన విషయంబులన్నియు నీపుత్రిక చెలిమికత్తెలవలన విని కడు విచారించితిని ఇప్పుడైనను మించినదేమియు లేదు ప్రతీకృతమును యోచించితిని.|రాజు చతురంగబలసంపన్నుడు. ఏదుష్కార్యమునకును వెనుదీయువాడు కాడు. కావున నీవీ క్షణమందే సేవకుల నియోగించి, వెంటనే మీ వైశ్యసంఘంబుల బిలువ నంపి కర్తవ్యము నిర్దేశింపవలయును.

కన్య—ఈవిషయమై వారలతో బర్యాలోచనమేల? ఇది మన

స్వవిషయము ఒకవేళ వారి విస్మృతపథమునకుఁ బడి, నన్ను వాని కీయ మందు రేమో?

భాస్క—ఇందు ధర్మము నిర్ణయించవలయును కావున ధర్మవిచక్షణులగు వారల యభిప్రాయమును ముఖ్యముగా గనుగొనవలయును. వారుమాత్రము ధర్మవ్యతిరిక్తమేల బల్కెదరు? కుసుమగుప్తా! ప్రథమమున నీకార్యమును జేయుము.

కుసు—చిత్తము; యిప్పుడే సేవకుల నియోగించెద

కన్య—ప్రాతఃకాలమున నీయకృత్యమున నాకు శివపూజ జరుగలేదు. నేనిప్పుడే పోయి నగరేశ్వరాలయమున కేగి పూజానిరత నయ్యెదను.

కుసు—వలదు; వలదు; నీవొంటిగ నేగినచో మరల నాయవినీతుఁ డెదురైన—

భాస్క—(వెర్రినవ్వుతో) ఏల నీకీభయము ఇంతకు ముందేమియో నీవు వచించుచుంటివే! నేనప్పుడపుడు వింటిని. వినుము.

గీ. ఇట్టివేయిరాజు లిరువదివేవురు
రాజరాజులైన రమణి యొంటి
కాలిగోటనైన గాంచ లేరింక నీ
బడుగువర్యుండె బట్టువాఁడు?

ఆవాక్యమే యెప్పుడు స్ఫురించుచుండును అమ్మా! నీవేగి శివపూజ గావించుకొని, నిశ్చయముగా రమ్ము.

తెరలో.

స్వామీ! కన్యాకుబ్జనగరపు రాజుకడనుండి రాయబారి యొకఁడరుదెంచి ద్వారముకడ వేచియున్నవాడు. సెలవైనచో ప్రవేశపెట్టెదను.

భాస్క—చూచితివా! రాజప్పుడే కృతనిశ్చయుడై తనసంక

ల్పమును దోహదము చేయుటకై, యీరాయభారిని మనకడకనిపియుం డునని నే నభిప్రాయ మొందుచున్నాను. ఇదియే నిక్కమైనయెడల వానియభిప్రాయముకూడ విని ప్రకృతము నిశ్చయించుదము. [లోనికి జూచి) సేవకా! వానినిట బ్రవేశపెట్టుము

ప్రవేశము—రాయబారి.

రాయ—వైశ్యప్రతినిధికి మేలుకలుగుగాక!

కుసు—మీరాకవలన మేము దరమును పవిత్రులమైతిమి. మిమ్ములజూడ మీరాజవరుడగు విష్ణువర్ధనుడే, యేతెంచెనని సంతసిం చుచున్నాము.

రాయ—మీరుమాకుజేయు సపర్యలన్నియు తనకుజెందినట్లే మాప్రభుడు తలంచును. రూపభేదమేకాని, కేవలము మేమిరువురము నొక్కటే.

కుసు—మరియుభాగ్యము.

రాయ—మాప్రభుడు జైత్రయాత్రసలిపి మార్గవశమునను, భాగ్యవశమునను మీపట్టణంబున విడిసియుండి, మీరుచేయించు సప ర్యలవలన చాలసంతృప్తుడయ్యె. మిమ్ములను జూచినదిమొదలు మా ప్రభుడు మీతోస్నేహభావమునకంటె మరియొకసంబంధమున గలసి మెలసి యుండవలయునని సంతోషించుచుండె.

భాస్క—కుసుమగుప్తా! బోధపడినదా! స్నేహమునకంటె మరి యొకసంబంధమట! బాంధవ్యమని వీరియభిప్రాయమై యుండును. అయ్యా! రాయబారీ! ఈవిషయమున మీప్రభుడించుక పొరబడియుం డనోపు. మీరనుకొనుచున్నట్లు వీరు క్షత్రియులుకారు. వైశ్యులు. ఈకుసుమగుప్తుండు పదునెనిమిదిపట్టణంబుల కధీశుడై, అతిశాంతభావ ముతో వైశ్యనాయకత్వము వహించి పాలించుచుండు మీరుతలంచిన

ట్లా మరియొకసంబంధ మిచ్చుట ననువర్తింపదేమోయని మాయభి
మతము.

కుసు—మీ ప్రభువుయొక్క సందేశమేమియో సెలవిచ్చెదరా!

రాయ—సందేహమేమి? మాకు-కాదు- కాదు-మాప్రభువు
నకు మీయందమితమగు వాత్సల్యము అందుచే మిమ్ములనేమియు
బాధింపక, కష్టములుగట్టుమనక, స్వతంత్రవృత్తికి విడిచియున్నాడు.

కుసు—కృతార్థులము. ఇక మీసందేశము?-

రాయ—చెప్పియుంటినికదా స్నేహముగాక మఱియొకసంబంధ
మని-అనగా మాకు (నాల్కగరచికొని) మారాజునకు మీతో బాం
ధవ్యముచేసికొనవలయునని యున్నది.

భాస్క—చెప్పియుంటినిగదా ఆభావమిచ్చుట వర్తింపదని. ఏల
నన- వీరు వైశ్యులు వారు క్షత్రియులు. కావున.

గీ. ధర్మమనునది జగతిలో తనరునేని
మతము, వంశంబు, సత్యంబు, మహిని మాయు
వేని, ధర్మములను జాతి బూనునేని
వర్ణసంకరమెట్లు సంభవము నేడు?

రాయ—అది మాకును దెలియును. కాని ఈధర్మమిచ్చుట బరి
వర్తింపదు. ఏలనన "వర్ణాను పూర్వేణ, ద్వేరాజన్యస్య" అను ధర్మ
సూత్రమునను సరించి, క్షత్రియులు తమతరువాత జాతులవారికన్యల
వివాహమాడవచ్చునని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి.

భాస్క—అదియు నిజమే కాని "వర్ణేతరసుతా కన్యానిషిద్ధా" యను
నుటచే భిన్నవర్ణస్థులను పరస్పరబంధుత్వమీ కలియుగమందు మాత్ర
ము నిషేధము

రాయ—ఏమో! ఈవిషయములు నాకెందుకు? మా ప్రభువు-

కుసు—(అర్థోక్తిలో) ఏదైన లేఖనిచ్చెనా?

రాయ—లేకయేందులకు? అతడే నేనని యిదివరలో చెప్పి యుంటిని.

కుసు—రాయబారీ! నీసందేశమును త్వరలో ముగించినచో మాకుబనియున్నది పోవలయును.

రాయ—మాప్రభువీయుదయమున భవదీయ పుత్రికంగాంచి ప్రేమించి, ఆమెను వివాహమాడవలయునని సంకల్పించుకొని మీయనుమతికై నన్నిటకు బంపెను.

కుసు—[కోపము] అయ్యో! ఇదియే నీ రాయబారమైనచో, నీవు సత్వరముగా నేగి మీప్రభునితో నిట్లంటివని బలుకుము.

మ. అరయన్ గుప్తయశోజ్జ్వల ప్రతిభమా
యఁగ లేదు; తద్ధర్మసం
స్ఫురణంబు న్నశియింపలేదు; మతముం
బోలేదు; ఇకన్ వైశ్యసం
ధరలో జారిణులై భువిన్ బ్రతుకు వ్య
ర్థత్వంబు రాలేదు; మా
యురె! యిమ్మాడ్కిని వర్ణసంకరముగా
నుద్వాహమున్ గోరఁగన్!

ఇంకనీ వరుగుము.

రాయ—బాగుగా యోచించుకొనుము.

ఉ. సారపరాక్రమోజ్జ్వలిత
సంస్ఫురణంబున పాండ్యభూపతిన్
పోరున నోర్చి, చోళకుల,
భూరమణున్, మళయాళనాథునిన్
కేరళభర్తను గెలిచి
కీర్తిగడించిన రాజరాజు: వి

స్తార యశోవిరాజితుఁడు
సద్గుణసాంద్రుఁడు; పార్థసుందరుఁడా॥

అట్టివాఁడు, తాను నీముద్దుమనుమరాలిం బరిణయమాడి సుఖింపవలెనని కోరుచుండ ఏలనిరాకరించెదవు? ఇందుకంగీకరింపనిచో, చతురుపాయంబుల నెట్లయిన నామెను సాధింపఁగా నాతఁడు కృతనిశ్చయుఁడై యున్నవాఁడు.

భాస్క—ఒక్క చతురుపాయంబులనే కాదు. చతుస్సహస్రోపాయంబులనుపయోగింపుమనుము. ధర్మవిరుద్ధమునుఁ గుష్టునాయఁడంగీకరింపఁడు. ఈమెను మీరాజు బడయలేఁడు

మరియు—

చ. మతవిషయంబులన్ బ్రథఁడై
మన్ననసేయక పంకజంబుచే
యతలచినాఁడె! వానికిది
న్యాయమె? ధర్మవిధానసమ్మతమె?
మతవిషయంబులన్ గలచు
మానవుఁడుర్వినెందుఁ గున్నె; స
మ్మతమున నిట్టిదుర్మతము
మానఁగఁజేయుము; మానవేశ్వరా.

ఇంకనీవు వెడలిపోవచ్చును.

రాయ—అయిన నీకూతు నిత్తువా నీయవా?

కుసు—నాచేతమాత్రము కాదు

రాయ—ముమ్మాటికిని దేనా నీయభిప్రాయము?

కుసు—వేయిమారులకునదియే మాయభిప్రాయము.

రాయ—అట్లయిన మీపురము రేపుదయములోపున భస్మపటలమగును. మీవైశ్యులందఱును కారాగారబద్ధులగుదురు.

కుసు—ఏమి బెదరించెదవా? అసంబద్ధములాడకుము. (కోపము) సేవకా! అసంబద్ధప్రలాపములాడు, ఈరాయబారినవలకుసాగ నంపుము. ఆలసింపకుము.

(సేవకుడు ప్రవేశించి రాయబారిభుజముపై చేయివైచును.)

రాయ—(కోపముతో) ఛీ! ఛీ! అవలనుండుము.

గీ. ఎవనిగాగదలంచి మీరిట్లు వదరు
చున్నవారలో ఖలులార యెన్నికొనుడు
బహుళనరవరనుతపాద పంకజుండు
గండుమీరెడు యావర్ధనుండెవీడు!

(ధైర్యముతో నిలచియుండును)

కన్య:—(రోషముతో) నీవెగా, నాయభిమాన ధనంబుల నపహరింప నెంచినది? నీవెగా, మాధర్మతత్వంబును రూపుమాపదెంచినది? నాభాగ్యవశమున శ్రీమలేకుండగనే నీవులభించినందులకు నీవీక్షణమువనే శమనపురి జేరియుందువు. కాని క్షమాగుణము పూనితి. కరుణించితి. ఇకనైన నీకన్యను మరచిపొమ్ము. పొమ్ము.

కుసు—భాస్క—[వారింతురు.]

విష్ణు—[నవ్వుచు] కుసుమగుప్తా!

గీ. బ్రతుకునందిచ్చకలదేని పగతినొసగి
అమితముగ భూమియందు సద్యశముగనుము
అటులకాదేని నీప్రాణ మవనిబాయ
జలజముఖి బట్టెదను నేను సాహసమున!

రేపు సాయంకాలమువరకు నీకు గడువొసంగితి. ఈలోపున బాగుగా యోచించుకొని, నాకు దెలియజేయవలయును. [కన్యకను రోషముతో దిలకించుచు వెడలిపోవును]

భాస్క:—గుప్తనాయకా! చూచితివా యీభూపాలుని కుటిలత్వము. కావున మనవైశ్యసంఘంబులు రేపటిదినమునకే యిచ్చటికి వచ్చునట్లు యేర్పాటు జేయుము. రాజ్ట్రని చేయుటకును వెనుదీయడు.

కుసు:—చిత్తము. తనయా! నీవీనా డాలయమున కేగవలదు.

కన్య:—జనకా! నాకొరకు భయపడకుము. జీవములతో నుండగా నన్నాతడు బడయలేడు. రమ్ము. పోదము.

అందరు నిష్క్రమింతురు.

ఇది ప్రథమాంకము.





# కన్యక

## ద్వితీయాంకము.



రంగము—శిబిరసమీపము.

ప్రవేశము:— విష్ణువర్ధన.

విష్ణు—

సీ. రమణీయవాక్సుధా రసధారలొలుకు నీ
మధురాధరంబు నే మరువగలనె?
నెఱసోనపేను నీ తలసారములమించు
కందోయిపడచి నే క్రాలగలనె?
మదమొహ్నగండు తుమ్మెదపిండుహసియించు
వేణీభరంబు నే వీడగలనె?
గొనబైనస్తనభారమున చాలనశియాడు
తనువల్లిగనక నే తాళగలనె?
గీ. పొలతి! నీముద్దు చెలువంబు పొందకుండ
ఇంచుకయు నేను భువిని జీవింపగలనె?
శ్యామ! సౌందర్యసీమ! గుణాభిరామ!
రామ! నినువీడిబ్రతుక తరంబె నాకు.

కాని ఈస్వల్పవిషయమే నాకు బహుదుర్ఘటమని దోచుచున్నది

తండ్రి-తండ్రికంటె గురుడు-అందరికంటె నాకన్యకామణి, ధైర్యసాహసంబుల మించియున్నారు. వైశ్యులకు సహజమగు భీరుత్వమెందును వారియందు గాన్పించుటలేదు కేవల ధర్మస్వరూపులై వారలు ప్రకాశించుచున్నవారలు. ఈసంస్థయందు జయము ధర్మమునకా— లేక బలమునకా యని యోజింపవలయును (ఆలోచన) వారిశక్తి కేవలము ధర్మయుక్తమే కాని, నావిషయమో ధర్మబల యుక్తము కావున జయము నాకేయగునని దోచు.

మ. అటుగాకీవణిజుల్ మదోద్ధతినిన
యృష్టాత్మునిన్ నాకురే
పటికీకన్న, మనీయశౌర్యముననా
వైశ్యాళిబంధింపుచున్
చటులోగ్రాకృతిమీరగా గొనెదనా
సారంగనేత్రిన్ ధరే
కుటిలత్వంబు సహింపజాలుదునె? లో
కుల్ విన్నచో నవ్వరే

అటుగాకీవైశ్యులు కపటంగ కుటుంబికులు. తేనియపలుకు మాటలవలన మోసమునకు గడంగుదురని విందును. కావున నెట్టియున నాకన్యాలలామను బలిమిచేనే నిప్పటినుండియే శీఘ్రముగ ప్రయత్నింప వలయు. వీరిశౌర్యధైర్యంబుల యోచింప, వీరెంతటి సాహసమునకైన వెనుదీయువారు కారనియే తోచుచున్నది. (దూరముగ పరికించి ఆశ్చర్యముతో)

ఔరా! ఏమి యీమె ధైర్యము! పగతురు పలువురు పట్టణమున ప్రబలియుండు తిరిగియు, నిర్భయముగ నగరేశ్వరాలయమునకీ కన్యకామణి వెడలుచున్నది.

గీ. సహజసౌందర్యమున మించు సాహసమున
వెడలుచున్నది యిప్పుడీ పడతి యిటుల;

అంగజుని పొందుబాసి, దుఃఖార్తయగుచు
దేవు శిరజేరు నారతీ దేవిభంగి.

(పర్యాలోచించి) శహబాస్! ఈయాలోచనమే యుక్తముగా నున్నది. ఇప్పుడే యీమెను మాశిబిరమున బంధించి, కుసుమగుప్తుడంగీకరించినచో విధి విధానంబుగను, లేనిచో రాక్షసంబున నీమెను బడసెదగాక! బలే విష్ణువర్ధనా! అనాయాసంబున నీమనోహారిణిని బడయుచున్నవాడవు. నీవే యదృష్టవంతుడవు అల్లడే! నామిత్రులు కరంటక విభీతకు లరుదెంచుచున్నారు. వారలకీ పని, నియోగించెదగాక.

ప్రవేశము: కరంటక, విభీతక

కరం: విభీ: మహారాజుగారికి జయము.

విష్ణు—మిత్రులారా! మీరింతవర కెటకేగితిరి ?

విభీత—తమ రావైశ్యప్రతినిధి పేరోలగమునకేగి మరలి ఆయుద్యానవన మార్గమున వచ్చెదరని మీకొరకు మేమిరువురమునుయింతవరకచ్చటనే వేచియుంటిమి కాని దేవరవారింతవరకు రాకపోవుటచే నేమిప్రమాదము సంభవించినదోయని, కుసుమగుప్తునింటికేగి, అచ్చటనుమీరు లేనందున తిరిగివచ్చునప్పటి కింతసేపైనది.

విష్ణు—నేను వెడలివచ్చినతరువాత వార్తలేమైన నీకు దెలిసినవా ?

విభీ—తెలియకేమి ? దేవరవారికా కన్యకామణి నిచ్చు విషయమై రేపుమధ్యాహ్నము వారొక సభగావించి, అందలి తీర్మానములననుసరించి, దేవరనువర్తమానింతురట. ఆసభకై వైశ్యసంఘముల బిలువనంప సేవకుల నియోగించుచున్నారు.

విష్ణు—మిత్రమా! వారితీర్మాన మేతీరున బరిణమిల్లునో నీవూహింపగలవా?

విక్రీ—(సందేహముతో) నాబుద్ధికేమియుఁదోచుటలేదు.

విష్ణు—కంటకా! నీవో?

కరం—వారితీర్మానములు దేవర యభిప్రాయమున కనుగుణ్యముగనేయుండును. దేవరవారికి వ్యతిరిక్తములగు నభిప్రాయముల తీర్మానించి, ఆకన్యకామణిని మీకీయనిచో కలుగు చెడుగుల వారలకు బూర్తముగా దెలియును. ఒకవేళ దేవరవారి కాకన్యనీయనిచో, [నమస్కరించి] శెలవైనచో నీకరంటకుఁడేగి మూడు నిముసములలో నామెను దేవరసన్నిధి నుంచగలఁడు

విష్ణు—మిత్రమా! నీకెంతయు కృతజ్ఞుఁడను.

విక్రీ—[తనలో] ఆహా! పరనారీసోదరుఁడని బిరుదువహించిన యీమహామహునకీనాఁడిట్టి యధర్మబుద్ధి జనించుట మిగులనాశ్చర్యము. అగ్నికివాయువుతోడైనట్లీ కరంటకుఁడీ ప్రభునిసంకల్పమును మరింత బలపరచుచున్నాఁడు కూడదని నేజెప్పిన నేనీప్రభునియాగ్రహంబునకు బాత్రుఁడగావలసి వచ్చును.

విష్ణు—విక్రీతకా! ఏమాలోచించుచున్నావు?

విక్రీ—ఏమియులేదు దేవరవారికీ విషయము కష్టసాధ్యమేమో యని.

విష్ణు—కష్టమేల? వారు నాకంటె బలహీనులుకదా!

విక్రీ—ధర్మమునఁ బలవంతులే!

విష్ణు—అట్లైన నా దధర్మమా!

విక్రీ—నాయభిప్రాయ మది కాదు

విష్ణు—మరేది?

విక్రీ—దేవరకిది కూడదని

ఔరా! నీవు నాకు నీతులఁబోధించుచుంటివా? అట్లైన నీవే ధర్మసంస్థాపకుఁడవై, దర్మోద్ధరణకై వీరకంకణమును బూనుము.

కరం— ప్రభూ! ఈతడన్నివిషయముల నిట్లే దురోబ్ధనల కారంభించును. సెలవిందు మే మేమిసేయవలయునో—

విష్ణు—మీరు నాకు మిత్రులేనా?

విభీ—ఔను.

విష్ణు—నేను రాజ్యపాలకుడనేకదా!

విభీ—కాదని యెవ్వరన్నారు.

విష్ణు—మీరు నాకార్యముల నన్నింటిని భక్తిపురస్సరముగా నిర్వర్తింపవలసినదేనా?

కరం—త్రికరణశుద్ధిగా—

విష్ణు—అట్లయిన నటుచూడుడు. నామనోహారిణి, యొంటిగా నగరేశ్వరాలమున కేగుచున్నది. విభీతకుడు వచించినట్లు హృదయమేదియో కీడును శంకించుచున్నది. కావున, ననాయాసముగ లభించునాకన్యకనుబట్టి నాశిబిరమున బంధింపుడు.

గీ. హృదయఫలకంబునందు మూర్తిభవించి
లేతనవ్వుల వెదజల్లి లేమ! ప్రేమ
సాగరంబున ననుముంచి యేగనెటకో?
నెలతనెడబాసి జీవముల్ నిలుపగలనె?

ఆమెకేమియు నపాయము కలుగరాదు. పరుషోక్తులాడకూడదు ఆమెను ముట్టుకొనరాదు. ఆమె కడు సాహసిక. జాగ్రత.

విభీ—(తనలో) తుదకు నేననుకొన్నట్లేయైనది. ఈ యధర్మకార్యమున నేనుగూడ పాల్గొనవలసివచ్చినది. అంగీకరింపని చో రాజాగ్రహము. అంగీకరించినచో ధర్మహాని. ముందునుయ్యి. వెనుక గొయ్యి—

విష్ణు—విభీతకా! మౌనమువహించెద వేల? ఏమాలోచించుచున్నావు.

విభీ—నాకీనాడు కొంచెము శరీరమస్వస్థతగా నున్నది.

కరం—నీకటులనే యుండునోయి. ప్రభూ! ఈతఁడీకార్యము నుండి తప్పించుకొనుటకై పన్నినయుక్తియిది—

విభీ—దేవరయెదుట పరిహాసములకు సమయముకాదు.

విష్ణు—రాజకార్యమును నిర్వహింపవలయునెడల ప్రాణములనే విడవలసియుండును. నీవేగియేతేరవలయును. మారుమాటాడకుము పొమ్ము.

విభీ—దేవరయిష్టము.

విష్ణు—జాగ్రత. నిష్క్రమించును.]

కరం—విభీతకా! మనప్రభుని యభిప్రాయానుసారముగా, నామెకపాయము గలుగకుండ, పరుషోక్తులాడకుండ, ముట్టుకొనకుండ బట్టేమార్గ మొకటి యున్నది. నీవిచ్చటనే యుండుము. ఆసాధనమును సంగ్రహించి తెచ్చెదను. నిష్క్రమించును.)

విభీ—అకటా! ఈదుర్మార్గుఁడట్టికార్యమునకును వెనుకదీయఁడు నేనిప్పుడు వీనితో నేకీభవింపకపోతినేని, రాజాగ్రహమునకు బాత్రుఁడనై సమయవలసివచ్చును ఏకీభవించితినో నధర్మమునకు ప్రోత్సాహపడినవాఁడనగుదు. ఒకవేళ నేను వీనితో నేకీభవింపక వెడలిపోయినను, నీదుష్టుఁడీమెను బట్టకమానఁడు. కావున ఎట్లైనను వీనివెంటనే యుండి, ఆమెనుగాపాడ ప్రయత్నించెదగాక! మిాదుమిక్కిలి తటస్థించినచో, అప్పుడే సేవకావృత్తిమాని దేశాంతరమేగెదగాక!

కరం—ఒకత్రాటితో ప్రవేశించి] విభీతకా! చూచితివా యీత్రాడు దీనిచివర పురివేసి, ఆమె సహ్యముగా వచ్చునోరాదోయడిగి రాకపోయినచో నీయురి నామెపదుముకు—దూరమునుండియే తగిల్చి, త్రాటయొక్క రెండవకొనను మనము బట్టుకొని, ముందు నడచినచో, ఆమెయే, యజమానుని వెంటవచ్చు శునకమువలె మనలను

వెంటాడుదును. [లోన. రికించి] కొంచముని గినది. ఆమెదగ్గరకు వచ్చినది. నీవామూలడాగి యుండుము నేనీమూల నుండెదను.

విభీ—ఒరే! మనముమాత్రము బహుచమత్కారముగా చేయవలె నీకని.

(ఇరువురు డాగియుందురు]

ప్రవేశము కన్యక.

కరం విభీ చెరియొకప్రక్క నిలుచుందురు.

కన్య—(కోపముతో) ఎవరుమీరు? ఈసాహసమేమి?

కరం—నేను మహారాజాధిరాజశ్రీ బిరుదాంకిత శ్రీవిష్ణువర్ధన

విభీ—అర్థోక్తిలో ఆఁ—ఆఁ—నేను శ్రీరాణ్మహేంద్రవర రాజ్యరమాధీశ్వర, మహారా—

కరం—అర్థోకి ఛీ! ఛీ! నీవుమహారాజువా?

విభీ—నేనువిష్ణువర్ధనమహారాజున కాంతరంగికమిత్రుడను.

విభీ—నేను మహారాజు ప్రాణమునకు ప్రాణమను.

కన్య—ఏమి యీసైనికుల సాహసము? ఓరీ! ఈపురంబుననిట్టి దుండగములజేయ సాహసింపకుడు. తొలగిపొండు. కాకున్న మిమ్ము దండింపజేసెద. తొలంగుడు.

విభీ—ఈ బెదరింపులకేమి కాని, నిన్ను—మేము—బట్టి—

కన్య—ఛీ! ఏమిప్రేలితివి?

కరం—ఏభయములేదు. మహారాజుగారు మిమ్ములను ప్రేమించి నారు అందుచే మమ్ములనిచట గాపుంచి, మిమ్ములనుబట్టి వారిశిబిర మున బంధింపవలసినదిగా ఆజ్ఞ యిడినారు. మీరు సవ్యముగ మావెంటవచ్చెదరా! లేక మాపనికి పూనమా......

కన్య—మీరా నన్ను బం[illegible]చు వారు! (కైదారుదీసి]

ఉ. ఎవ్వతెగా దలంచియిటు లీక్రియదుండగ మాచరించినే
డివ్వనితన్ గ్రహింపమది నెంచితిరో ఖలులార మేనిలో
క్రొవ్వువు బెంచిరో! కుసుకు గుప్తుని పుత్రిక నం చెరుంగరో
దవ్వుతొలంగి పొండడుగు దాటవధించెద మిమ్ముని త్తఱిన్.

కరం—విభీ? [ఆశ్చర్యముతో తొలగుదురు.]

కరం—మేమంత చేతగానివారమని భావించుచుంటివా? వెంటవచ్చెదవా రావా? (ఖడ్గము బెరికి) నడువును.

విభీ—[కరంటకునాపి] వలదు. వలదు! తాళుము తాళుము ఖడ్గము తీసెదవేల? ఆమె కపాయముకలుగును.

కన్య—పిరికిపందలారా! మీకీ సైనికపదవి నొసంగినందులకు మీమహారాజుకే తగును. తక్షణమేపొండు.

కరం—(నాల్కగరచుకొని) మహారాజుగారు మనకత్తుల నుపయోగింప వలదన్నారురా! బాబు.

కన్య—[గర్వముతో] పొండు.

ప్రవేశము—విష్ణువర్ధనుడు వెనుకవైపునుండి.

విష్ణు—[కన్యకచేతిలోని బాకును లాగివైచి]

మ. అతివా! కోపమదేల! నిన్నడయనా
కత్యంతసంతోషమా.

కన్య—[అర్ధోక్తిలో కోపముతో]

గీ. ఈదురాగత మీనైచ్య మిట్టిపాడు
కార్యములనేలజేతువు కఠినహృదయ
దండధరువీటికిన్ పోవ దలచినావె
పాపములమూట నెత్తిపై బట్టికొనుచు.





విష్ణు—

మ. అతివా కోపమదేల నిప్పుడయ నా
కత్యంత సంతోషమా
టతగన్ వీరల నిన్నుబట్టతరియా
టక్ బుచ్చినానిందు, యే
వెతలన్ బెట్టకరమ్మ వెంటయికనీ
వేసాలుచాలించి సం
తతసంతోషసుఖాబ్ధి దేల్చెదను ని
త్యంబబ్జవిభాస్యనా.

ఆలసింపక గౌరవముగా నడచిరమ్మా. లేనేనినిను బలిమిని స్పృశించి బట్టుటకు వీరికాజ్ఞ యిచ్చెద. మిత్రులారా! చూచెదరేమి?

[సైనికులు కత్తులదీసి అడ్డముగాబట్టుకొందురు.]

కన్య—(తనలో) ఆహా! పరిమాదమయ్యె, పూర్ణముగ దుర్మార్గమునకు బూనినారు. ప్రస్తుతము రక్షణోపాయము కానరాదు నేను వీనివెంట యేగనున్న బలిమి నుపయోగింతురు. కావున ప్రస్తుతము వీరివెంట నేపోయి అనంతరము యోచించెదగాక! జీవములతోనే నీతనికి లభించుటకల్ల. [నడచును]

[తెరపడును.]

ద్వితీయరంగము—శిబిరము.

కన్యక విచారముతో

కన్య—రాజరుదెంచు సమయమైనది. అకటా! ఈదుర్మార్గుడు నన్నెట్టివిపత్తుల పాలుగావించుచున్నాడు.

ఉ. గాంచినతోడ నప్పుడయి గామదినెంచి దురోక్తులాడె క్రో
ధించుచువచ్చి సజ్జనకు దీప్తిమెయిన్ ననుగోరపాపియై

పంచెనుగైనికాళినను బంధనజేసిపరిగ్రహింప; యే
తెంచెనో? ఏమిసేయుదునొకో దీనను కావగరావె దైవమా!

అక్కటా! పుట్టిననాటనుండియు నల్లారుముద్దుగా బెరిగి, నిరంతరశంకరభగవత్పాదారవింద పూజాతత్పరనై, యైహిక సుఖంబులవీడి, భక్తిమార్గమున బ్రొద్దుపుచ్చుచు నాకీకష్టములు- శంకరా!—ఏల బెట్టెదవు! నీకింత వెగటుగాగాన్పించిదనచో, నీత్రిశూలాహతిచే నన్నొకమారు చంపివేయరాదా! ప్రళయకాలానిలంబును మించు నీమూడవనేత్రంబును విప్పి నన్ను భస్మముచేయరాదా! ఏల నీకీదయాహీనత

శంకరా! శంకరా!- ఈభక్తురాలొక నీచునిచే పరిభవింపబడుచుండ గాంచి సంతసింపవలెనను బుద్ధియా నీకు? నీభక్తవరులకుగష్టములకారణముగ గలుగుచుండ, గాపాడ నీయది కాదా విభూ? ఏలరావు? ఏలబలుకవు? ఈక్షణికమునదో, మరియొకక్షణముననో రాజుర్గానైయున్నాడు!- నన్నవమానపరుపనెంచియున్నాడు అదిగో! అడుగుల జాడ వినిపించుచున్నది

శంకరా! శంకరా! శంకరా!- తరతరంబులనుండియు నిష్కళంక దుర్నిరీక్ష్య తేజోజ్వలమై ప్రకాశించు మావైశ్యధర్మంబడుగంటవలసినదేనా? నిరుపమ సపరాక్రమస్ఫురణంబునమించుమాగుప్తశౌర్యధైర్యంబులు నశించవలసినదేనా? అమితపవిత్రితరంబైన మావంశము నామూలమునగ గళంకభూతనై, నాశనముకావలసినదేనా? ఏల పలుకవు?

అయ్యయో! నాశంకరుడు బలుకడు. శంకరా! నీను భక్తరక్షణము నశించినది. నీహృదయమున కరుణారసము యింకిపోయినది. హా! ఇంక నేనే తరుణోపాయము నరయవలయును.

[ఆలోచన] కానున్న, నేనిప్పుడే జీవములబాసి, యీవిష్ణువర్ధను

దుర్మార్గమునుండి దప్పించుకొని, మానధనమును గాపాడికొనెద.

ఓకన్యకా! ఎంత బేలతనము బూనితివి? ఇందువలన నీకు గలుగు కీర్తియేమి? వలదు: వలదు. నీవు మరణించుటవలన గౌరవము కాపాడబడినను, పౌరుషము నశించును. అందుచే నామహారాజునకు భయమంది, నీవు మరణించితివని లోకులు తలంతురు. అటుల తలంప నవకాశ మొసంగుటయే గాక, తర తరంబులనుండియు వెలుగొందు నీ గుప్తపవిత్రశౌర్యసాహస ధనంబుల పాడుగావించిన దానవగుదువు. ధర్మసామ్రాజ్యమున నపవిత్రత ఘటిల్లజేసిన దానవగుదువు. వలదు. వలదు.

కావున, ఈరోజునకెట్లయిన గర్వభంగముగావించి ఇట్టి దుండగములెన్నడును శ్రేయోదాయకములు కావనెడి నీతి లోకమున దెలుపవలెను. నామనోహరుడగు నగరేశ్వరుని- సన్నిధానమున జేరుటకెన్నటికైన, ఈతనువును బాయవలసియేయున్నది కదా! ధర్మము నశించి, దుర్మార్గము ప్రబలి, ఈతని గర్వభంగము కాజాలనిచో, అప్పుడే యీతుచ్ఛములగు జీవముల బాసెదను. రానిమ్మా కృూరుని—

'ప్రవేశము: విశ్వాతకుడు ఫలహారములతో'

విశ్వా—[తనలో] ఈమెనుజూడ నామనంబున నొక యనివార్యమగు భక్తిరసముద్భవించుచున్నది. ఈమహాతల్లిని సేవించవలయు నను సంకల్పముకలుగున్నది. పాపమీమె కడు విచారించుచున్నది. ఈమె నెట్లయిన రక్షింపవలయును. [ప్రకాశముగా)

అమ్మా! ఇవిగో! ఫలహారములు. రాజుగారంపినారు.

కన్య—నీవును, నీరాజుగారును ఈఫలహారములతో నాశమగుదురు. [ఫలహారముల త్రోసివైచును

విశ్వా—అమ్మా! నిష్కారణముగ నాపై కోపగించెదవేల? ఇది

నాసేవకావృత్తి ధర్మము. ఈవిషయ మన్యాయమనియెఱింగియు వృత్తి ధర్మంబు ననుసరింపవలసివచ్చినది.

కన్య—ఈరాజుకృత్యము ధర్మవిరుద్ధమని నీకును తెలియునా ?

విభీ—తెలియబట్టియే, సీతుణము మొదలుకొని రాజసేవమాని నిన్నెట్లయిన నుద్ధరింప నిశ్చయించుకొని యిటకు వచ్చితి. నీవెట్లయిన నారాజుని దప్పించుకొంటివేని, నేను నిన్ను నిశ్చయముగ నీజనకుని జేర్చెదను తల్లీ రాజరుదెంచుచున్నాడు నేనేగి మరలివచ్చెదను.

కన్య నామేలుగోరిన యోపూజ్యుడా నీకనేక వందనములు.

విభీ—(నిష్క్రమించును.)

ప్రవేశము విష్ణువర్ధన.

విష్ణు—

గీ॥ జలజముఖ ! ఇంతకన్న ప్రసన్నవగుదో ?
లేదా ! నన్గ్రహించుటకో మోహభావ
మలరెనో ! కాదో ! మూర్ఖత్వ మగ్నికదియొ ?
తెలిసికొనవచ్చినాడ నీ తీరయిపుడు !

కావున ఒక్కమాట- అనుగ్రహింపబడితిని-అని వృదువధు రస్వరంబున వీనులవిందుగా నొక్కసారి బలుకుము.

కన్య—(చివాలునలేచి] అనుగ్రహమా ! రాజా ! నీవింకను నామనోగతంబును గుర్తెరుంగనటుల తలంచెదను.

విష్ణు—గుర్తెరుంగనేమి? నీవిప్పటికైన నాప్రభావమును గ్రహించితివనియు ఊరకవ్యర్థపుమాటలవలన లాభములేదను సంగతి యెరింగితివనియు ఎట్లులైనను నీవు నాకు వశవౌట తప్పదని గుర్తెరింగితివనియు నేనను గ్రహింపబడితినని యు నీయభిమతంబని గుర్తెరుంగపోలేదు

కన్య—అటుల స్వప్నమునన్నైన దలంపకుము. ప్రభావము, ప్రభా

వమనెదవేల? నీపరాభావము-నీపౌరుష మబలలబల్మినిగ్రహించుటకక్కరకువచ్చునని వేరు చెప్పనక్కరలేదు.

ఉ॥ పౌరుషశాలినంచు వెస పల్కులబల్కుచు యుబ్బెదేల? నీ
పౌరుసమీగతిన్ పరుల భామల బల్మిని బట్టవచ్చునం
చౌర యెరుంగవే? హృదయ మందున బాపుభీతి లేదె? ఛీ!
క్రూరతమీర, లోకమున కీర్తిగడింతువె నీవు? భూవరా!

విష్ణు—ఓహోహో! శ్రీరంగనీతుల చాలనేర్చితివే! ఇంతవరకు నిన్ను మాటాడినకైజారును వ్యయమానిశవనియే దలంచితిని కాని, ఇన్ని ధర్మపన్నములను కూడ నేర్చితివని యెరుంగను.

కన్య—ఇదివర కెరుంగనిపక్షమున, ఈగుప్తాంగన నిశ్చయమైన బాగుగా యెరుంగుము.

విష్ణు—బాగుగా యెరుంగుటకే నిన్నిచ్చటికి దెచ్చితిని! కాని పాపము. నీవుమాత్రము నావిషయమై తప్పుటభిప్రాయమును బొందుచుంటివని విచారించుచున్నాను.

కన్య—ఏల?

విష్ణు—ఏలనా? నీవునన్నొక పరకాంతాహరుడనని యెంచితివి కాని పరకాంతాసహోదరుడనని దలంపవైతివి. పరకాంతలవంక కన్నెత్తియైన జూడనని, పాపము నీవెరుంగవు.

కన్య—ఏలవ్యర్థముగ బల్కెదవు? నేను పరకీయనుగానా?

విష్ణు—అగుదువు. అయిన?

కన్య—పరకీయ నీకు సహోదరియని యంటివి కాదా?

విష్ణు—నిశ్చయముగా నిందు చక్కనియుక్తి నుపయోగించితివి నీవు పరకీయవేయగుదువు కాని, పరోఢవు అనగా పరకాంతవుమాత్రము కావు కన్యవు అవివాహితవు. పరోఢవే నాకు సోదరీమణుల గుదురు కాని, నీవంటికన్యలు నాకు వరణీయలే!

కన్య—అయ్యా! నేను కన్యను గాననియు పరకాంతననియు నీకు తెలియకపోయియుండును

శిష్య—అదియే నిజమైనచో నిన్నీక్షణమందే నీభర్తసన్నిధి కని పెద. వచింపుము నీభర్తయెవ్వరో!

కన్య—ఆశంకరభగవానుని సాక్షిగా బలుకుచున్నాను నేను మొదటినుండియు మనోవాక్కాయ కర్మంబుల మా నగరేశ్వరుండైన ఆశంకరభగవానునే వరించియున్నదాన.

గీ. త్రికరణంబులుమీర నా దేవదేవు
మదిని బ్రేమించి యామహా మహునిసేవ
బూని సంతోషమలరెడు దాననయ్య!
ఆతడే నాకు హృదయేశు డగును నిజము.

ఆభగవానుని మానసికముగా నేనేయుద్వాహమాడి, పతిసేవా నిరతనౌట నిజమయ్యా!

శిష్య—నీకేమయిన మతియున్నదా! పోయినదా! ఈటక్కులు నాదగ్గరనా! నగరేశ్వరాలయములో మూఢులకు భక్తిగుదురుటకై భగవంతునకు మారుగా బ్రతిష్ఠింపబడిన రాతినా నీవు ప్రేమించి నది. శహభాష్! ఎంతరమ్యముగానున్నది. ఆబండయే నీకుభర్తయై అన్నోదకములనిచ్చి, నీసకలవాంఛితములదీర్చును కాబోలునేమి? ఆబండయే నిన్ను సకలసౌఖ్య కేళీవిలాసముల దేల్చును కాబోలునేమి? (నవ్వి) ఒకవేళ నీయభిప్రాయమే నిశ్చయమనుకొందము. నీవే యాబండంరాతిని ప్రేమించితివి కాని నిన్నాపెనుబండ ప్రేమించినదా? లేదు. మఱియు నీవే యాబండను వివాహమాడితివికాని నిన్నాశిలవివాహమాడెనా? అదియునులేదు పైగా మానసికముగా బరిణయమాడితివంటివి. ఎంత యుక్తియుక్తముగా బలికితివి? పరస్పర సంబంధముగువరి, పరస్పరము

యిష్టముకలిగి, వేదశాస్త్రోక్తరీతిని యథావిధిగా జరుపబడినదే వివాహముకాని, వధువు తనలోనొకరిని ప్రేమించితిననియు, మానసికముగ వివాహమాడితిననియు చెప్పినంతమాత్రమున నదియొకవివాహమగునా? ఆమె యొక పరకాంతయగునా? నగరేశ్వరునిమీద నీకుభక్తియుండిన నుండుగాక! అయినను నీవింకనుకన్యవే అవివాహితవే నాచే కోరబడతగినదానవే ఈయుక్తులనేలబన్నెదవు. ఇవన్నియు నన్నుభ్రమింపజేయుటకై నీవుప్రయోగించు అస్త్రములని నేనెరుఁగకపోలేదు కావున మనోహారి ఊరకవాదులాడక నన్ను పరిగ్రహించి సుఖమందుము అటుచూడుము.

సీ॥ వివిధరత్నప్రభా విభ్రాజితంబులై
తనరారునవ్యసౌధంబులొకట
కలకంఠపికశారి కాకలస్వనముల
భాసిల్లునుద్యాన వనములొకట
కమనీయకహ్లార కైరవోత్కరములై
దంబుమీరెడిసార సంబులొకట
అంబరచుంబిశృంగానూనవిఖ్యాత
రమణీయమాగోపు రంబులొకట

గీ॥ గలిగిభాగ్యమింపొందు గానదాని
నేలుమికపట్టమహిషివై యింపుమీర!
బాల!కోపమదేల? ఈ లీలజాల
మేల? దాసుడనౌదున న్నేలుకొనవె!

(సమీపించును)

నక్య—[కోపముతో] దూరము నీవెటులభావించినను నేనుపతివ్రతను మదాంధుడవై [illegible] శంపించెద.

విష్ణు—ఓహో! నీకింతవరకు వివాహము కాలేదనియు వివాహముగాకపోవుటచే పతిలభించలేదనియు భర్తలభింపకపోవుటచే పతివ్రతవు కావనియు నింతకుముందే చెప్పితిని. మరల చెప్పుచున్నాను ఇంక నీశాపమునకు విలువయెక్కడిది? శపించుము నీయిష్టమువచ్చినటుల- అయినను నిన్ను బడయకమానను-

కన్య—(కోపముతో) దుష్టాత్మా! నీకీతలంపుతగదు. పరసతి వాంఛగలవారెవ్వరును బాగుపడలేదు. ప్రాణములు గోలుపోయిరి కాని-

సీ॥ వరసతీమణియైన ధరణిజ ప్రేమించి
పంక్తికంధరుడేమి ఫలముగాంచె?
అలనాడు దమయంతి నరి కట్టు తరి బోయ
నాయకుండేమి సన్మానమొందె?
కాంక్షించి, పాంచాలి గవయనెంచినపాపి
కీచకుండేమి సత్కీర్తిజెందె?
మరుబాణహతిచేత గిరిజగోరినజలం
ధరుగాంచనేమి సద్గతిలభించె?
గీ॥ తెలియదో? మాంద్యమో? మేని బలిమిపెంపొ?
ధర్మమెవ్వానికైన తెల్పరో తగదటంచు
ఇటుల తగదయ్య! ధర్మంబు నెరుగుమయ్య
నన్ను రక్షించి సత్కీర్తి నెన్నుమయ్య!
కావున నన్ను బదలి సద్యశము గాంచుము.

విష్ణు—నీవు వచించినదంతయు నిజమే కాని, ఇయ్యది నీయొక్క లేశమైనను వర్తింపదు ఊరకొన్నకొలది వదరక అంగీకరింపుము.

కన్య—అంగీకారమా! నీవు వేయేండ్లు తలక్రిందుగా తపము

చేసినను, నేను నీకులభించుట కల్ల.

విష్ణు—(కోపముతో) ఇంతవరకు నీవంగీకరింతువని వేచియుం టిని ఇప్పుడే నిన్ను రాక్షసహితముగా బలాత్కరించిన నెవ్వరేమి చేయగలరు? వెంకిపిల్లా!

కన్య—ఎవరా! నాపాతివ్రత్యము - పాతివ్రత్యము నామనో హరుడు శంకరుడు - నన్ను రక్షింపగలడు

విష్ణు— ఛీ! పాతివ్రత్యము పాతివ్రత్యమని మొరగుదవేల? నిన్నును నీపాతివ్రత్యమును జూచెదను.

గీ॥ తరుణి! నీవెంత, నీకున్న ధర్మమెంత
నీదు విభుసేవయెంత! నీ వాదమెంత
జాగుసైరింప నింక నీ సణుగు లేల!
రమ్ము! రయమునకౌగిలి, నిమ్ము! బాల!

(సమీపించును.

కన్య—ఛీ! అసంబద్ధప్రలాపీ! చూడుము నీగతియేమి కానున్నదో! హాశంకరా! రక్షింపవేమి? (చేతులజోడించి)

చ॥ అనవరతంబు నీకె మన
సర్పణచేసి వరించితయ్య! ఈ
తనువొకనీచమానవుని
ధర్మవిహీనత కోరెదయ్య! ఈ
మనుజువినందు నేడు దయ
మాలి ననున్ గ్రహియింప నాకు వే
దన నిడుచుండెనయ్య! దయ
తప్పెనె? బ్రోవగరావె? శంకరా!

విష్ణు—(నవ్వుచు) ఇది కలికాలము. పాపము నీవింకను త్రేతా యుగములోనున్నటుల తలంచుచుంటివేమి? ఇచ్చట నీకళ్లబొల్లియేడు

పుల వినువారెవ్వరు! ఇవన్ని వ్యర్థములు అయినను నీవు ధర్మమో ధర్మమోయని బలుకుచుంటివే! పాపము నాకు జాలియగుచున్నది. కావున ఆ ధర్మమేదియో నేనే విమర్శనము జేసి, ఈ బాంధవ్యము ధర్మయుక్తము కానిచో, పుష్పములలో బెట్టినట్లు నిన్ని క్షణమందే నీజనకుని సన్నిధిం జేర్చెదను. ధర్మయుక్తమైనచో నిన్ను పరిగ్రహించియే తీరుదును. కావున చెప్పికొనుము

కన్య—సత్యమేనా?

విష్ణు—ఏల సందేహించెదవు? నేను రాజ్యపాలకుడను. నేనే ధర్మవిమర్శనము చేయనిచో, నింక యోచించువారెవ్వరు? సందియం బందకుము.

కన్య—నీవు రాజ్యపాలకుడవౌటచే ప్రజలకెల్లరకు నీవు తండ్రివి కావున నాకును జనకుడ వేయగుదువు. దయచేసి నన్ను విడువుము. తండ్రీ!

విష్ణు—ప్రజలకెల్లరకు రాజు తండ్రి కావున, నికముందు పుట్టబోవువారుకాని, పుట్టినవారుకాని, గతించినవారుకాని, భూనాయకులు వివాహమాడకూడదనియు, వివాహమాడినచో నీవావిదోషము వారలకు గల్గుననియు, నొకనూతనధర్మమును నీవాక్యములవలన నేర్చుకొనవలయును. ఇదియే నిజముగా దోషమైనయెడల, సేతులాంత గల్పించిన వాగ్దేవిని వివాహమాడిన యాసృష్టికర్త కింతకంటె యెక్కుడుదోషము చెందవలసియున్నది. కావున నీవు వచించునదొక ధర్మము కాదు వరణీయయగు కన్య లభించునపుడు, వంశాభివృద్ధికొరకు, క్షత్రియులు వివాహమాడవలసియే యుండును. నీవు వరణీయవు. నాకు తగినదానవు మరియు నీవు జన్మమున వైశ్యజవయ్యు, నీయందసమానం బగు క్షాత్రతేజంబుట్టిపడుచున్నది. కావుననె నీవు నన్నాకర్షించితివి.

కన్య—వరణీయనే వివాహమాడవలయును కాని వివాహ

మాడతగినవారు కానిచో కూడదని నాయభిప్రాయము.

గీ. ప్రాయమున చిన్నదానను వైశ్యవంశ
మందు జన్మంబునొందితి నయ్య! యెట్లు
అన్యకులజను యుద్వాహ మాడెదయ్య
ధర్మమెరుగక సన్నోర తగునటయ్య!

విష్ణు—పోనిమ్మది విమర్శచేసెద. క్షత్రియులకు వర్ణానుపూర్వముగా, అనగా వైశ్య, శూద్రవంశజులను, పరిగ్రహింపవచ్చనని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవని. ఆనాడు మీతండ్రితో ఖండించియుంటిని. ఇదియును న్యాయముకాదు.

కన్య—(తనలో) అబ్బా! ఈతడెన్నివిధంబుల నుద్బోధించినను వినడేమిసేయుదు? (ప్రకాశము] అయ్యా! నీకనేకులు భార్యలున్నారు కనికరించి, వారితో సౌఖ్యములందుము. లేశమైనను నీయందభిలాష లేని నన్ను విడువుమయ్యా!

విష్ణు—ఏలనిరర్థకములును, నిష్ప్రయోజనములునగు మాటల నుడివెదవు. నీవు బలికెడిదంతయు కేవలము బలహీనములు.

కన్య—(తనలో) అయ్యో! ఇంకేమని బోధింతును?

విష్ణు—ఇంకేమైననున్నచో వచింపుము జాగువలదు. నన్ను నీవో, లేక నిన్ను నేనో, యీక్షణమందే గెలువవలెను. నీధర్మోపన్యాసములైనవా లేవా?

కన్య—[తనలో) కటకటా! ఈదుర్మార్గుడు కాముకుడై, యెన్నివిధముల తగదని వక్కాణించినను వినకున్నవాడు. నాకింక దారియేది?

విష్ణు—మాటాడవేమి?

కన్య—(కోపముతో) మాటాడ కేమి? వినుము.

చ. క్షత్రియలుగాగ వైశ్యులను
దున్మ్రము క్రూరత, గాకయున్న నా

జనకుని: హూత, జుట్టముల
జంపుము యిచ్చకువచ్చురీతి, నా
తనువును ముక్కముక్కలుగ
తాపముదీర వధింపుమైన గా
నినను సజీవగా బసియ
నేరదువే కలనైన ! నీచుడా !

(అని చిరచెరగుచే కంఠమున కురిబోయును.)

విష్ణు—(కోపముతో) ఆ:—

గీ. తరుణి! నీవెంత; నీకున్న ధైర్యమెంత
పంతమునకైన నిన్ను నే బట్టుటెంత
కంఠమునకొనజీవంబు గిలిగియున్న
నిన్ను బడయక మాననో నెలతమిన్న!

ఛీ! నీవేకిరో మహాపరాక్రమశాలినినను కొంటిని. నిన్ను చావనిత్తునా (ఉరిని లాగును)

కన్య—(దుఃఖముతో) హా! పరమేశ్వరా! శంకరా! తుదకు నాజీవముల నెగబాయుటకుకూడ నధికారము లేకుండ జేసితివా!

(లోనసుండి త్రిశూలముగు దెంచి రాజుముఖముపైనుండును. రాజు మూర్ఛిల్లును శంకరుడు ప్రత్యక్షమై)

శంక—ఓకన్యకామణీ! రాజుమూర్ఛిల్లియున్నాడు. సత్వరముగా లేచి, నీజనకుని జేరి, కర్తవ్యము నిశ్చయించుచు నీధైర్యసాహసములు నీధర్మబుద్ధియు మిగుల బ్రశంసనీయములు. జయము కరతలామలకమై యున్నది. లెమ్మా. (అంతర్ధానము)

విధీ—(ప్ర)వేశించి అయ్యో! పాపమీమె మూర్ఛిల్లియున్నది. రాజును మూర్ఛిల్లియున్నాడు. ఈసమయముననే నీమె నిచ్చటినుండి తొలగించెద (నేవదీర్చును)

కన్య—(లేచి కనులనలిపికొనుచు) ఆహా! ఏమిది? ఏమిది? ఎవ రో నాచెవిదగ్గిర బలికినట్టులయ్యెనే! (గలయజూచి) ఆహా! రాజు మూర్ఛిల్లియున్నాడు. ఇప్పటికి నేధన్యనైతి నేనేగి, ఈరాజవరుడు నేనదిరకపూర్వమే నాజనకునిజేరి కార్యాలోచనము చేయవలయు.

విశ్వ—(ఎదుటికివచ్చి) అమ్మా! ఇప్పటికి చాలమేలైనది. జాగ్రత్తగ నావెంటరమ్ము బయిట కరంటకుడు గాపున్నవాడు వాని కి గనబడకుండ వేరుమార్గమున, నీజనకుని సన్నిధిజేర్చెద.

కన్య—అన్నా! నీయుపకారమును మరువగలనా? నడు పుము.

(నిష్క్రమింతురు అవనికజారును]

మూడవసంగము—శిబిరము.

రాజుమూర్ఛితుడై.

విష్ణు—(ఇటునటుపొరలుచు) జీవితేశ్వరీ! మనోహరీ! కన్యకా! ఒక్కమారు నీతనువల్లి నాబాహులతలం జేర్చి నన్నుసుఖపెట్టుము. ఇదిగో! ఒక్క కరుణాకటాక్షము నాపై బరపుము. ఇటుజూడుము. [నెమ్మదిగాలేచి] ఊరకనన్నేలశ్రమపెట్టెదవు? నాయట్టివరుడు వేయేం డ్లు వెదకినను నీకుగానరాడు. బాలా రమ్ము. (బల్లనాలింగనము చేయ బోవును శిరమునకు దెబ్బతగులును చేతిలోసిరమును బట్టుకొని) జగ దేకసుందరాకారత కన్నులకు మిరుమిట్లుగొలుప, ఎచ్చటజూచినను నాకా మనోహరిస్వరూపమే గానవచ్చుచున్నది. నాప్రేమస్వరూపిణి, యేమూలనో దాగియుండి దాగుడుమూతలాడుచు, నన్ను దుర్భర తరంబగు మోహసాగరమున ముంచివైచుచున్నది. సర్వమును కన్య కాస్వరూపమై గానవచ్చు నాకామె నిజస్వరూప మెచ్చటనున్నదో తెలియకున్నది కన్యకా! మనోహారీ! మదీయహృదయాధిదేవతా! ఎందుడాగియున్నావో! కన్యకా! కన్యకా! నిన్ను నేను కనుగొనజాలు

దునో లేనోయని పరీక్షించుచున్నావా? చూడుము నాశక్తి నిన్నిప్పుడే వెదకి పట్టుకొందును

శా. బాలా! కంటిని; నీవెకన్యకవు నన్
పాలింపవే!—నీవు కా
వా! లావణ్యపయోధి! డాగెదవ? నా
భాగ్యంబ! నాముద్దు
రాలా! కౌగిలినీయరావె!—అకటా!
హాస్యప్రదంబయ్యె ఛీ!
మేలంచ? ఇకనీకుదిక్కెవరు? బ
ల్మిన్! గాచికో బట్టెదన్.

ఎందువెదకినను ఈమె కాన్పించదు. (గలయవెదకును) అంతయు మోసమైనది. ఈకామినీరూప రాక్షసి నన్ను మహాప్రళయ తరఘోరతర మాయాకూపంబునబడి నెట్టియంతర్ధానమైనది నన్ను మోసగించి, నాకు దెలియకుండగనే పారిపోయినది.

ఓ కపటమానవరూప స్థితప్రత్యక్షరాక్షసీ! పొమ్ము. నీయిచ్చవచ్చినటుల! మాయావినీ! నీమాయాజాలముల నాజగజ్జేగీయమానకోగ్రధఘూర్ణిత మహాపరాక్రమముచే ఛిన్నభిన్నములుగా నొనరింతు ఎచ్చటికిపోగలవు నన్ను దప్పించుకొని నీతండ్రికడకేగిన, నిన్నును, నీతండ్రిని, నీరాజ్యమునుకూడ నంతమొందింపగలను. గాచికొనుము.

సీ. ఈరాజవరుతోడ పోరాడ గల్పించి
మదమెప్పనెదిరిన నెదురుగాక;
గాకున్న మదిలోన కడు సంభ్రమమునొంది
భయమంది పారిన పారుగాక
అటుగాక, కనుచాయ ఘటుమాయలనుబన్ని
దప్పింప దలచిన దలపుగాక;

కనుబ్రోవ, యలయింప గగనంబులకుడాచి
పురమెత్తిపోయిన పోప్రగాక;

గీ. ప్రళయఖడ్గధార బరతెంచి, గుప్తుల
వెదకి వెదకి బట్టి మదమడంచి,
వారిశోణితమున పసజెందిదైనను
నిన్నె బడయువాడ నెలతమిన్న !

కరంటకా !

ప్రవేశము: కరంటకుడు.

కరం—(భయముతో రాజునిరిక్షంచును] ఈయనతీరుచూడగా ఏదియో కోపమునిగినదనితోచుచున్నది.

విష్ణు—[కోపము) అట్లు వెర్రిచూపుచూచెదవేమి రమ్ము.

కరం—(భయముతో సమీపించును] తమ తీరు— నాకు— భయమును కలుగజేయుచున్నది.

విష్ణు—భయమేమియును లేదు కాని కన్యక తప్పించుకొనిపారి పోయినది.

కరం—[ఆశ్చర్యము] కన్యకయే! తప్పించుకొనుటయే-

విష్ణు—(కోపము) కన్యకయే తప్పించుకొనియేపోయినది. నీవె చ్చటచచ్చినావు? విభీతకుడేడి?

కరం—దేవరవారికార్యమునం దప్రమత్తుండనై బయటగాపుంటిని ఈయుదయమునుండియు విభీతకుడు నాకగపడలేదు.

విష్ణు—లేదు. నీవచ్చటలేవు. ఉన్న యెడల పోవుచున్నకన్యక నీకు కనిపించియే యుండును. మీరునాకు ద్రోహ మొనరించినారు.

కరం—దేవర పాదములసాక్షిగా బలుకుచున్నాను నేనేపాప మెరుంగను. నాదగ్గరనుండి, ఆమెపోలేదు.

విష్ణు—మరి యేమార్గమున పోయినది?

కరం—(పరిశీలించి) దేవా! ఆమెశిబిరమునకున్న చుట్టుగుడ్డను చించి యీదారినేపోయినది. అదిగో, ఇద్దరి అడుగులజాడ కనిపించు చున్నది. విభీతకుఁడు ఆమెకుతోడ్పడి స్వామిద్రోహ మొనరించినటుల దోచుచున్నది.

విష్ణు—ఛీ! పొమ్ము. మీరిరువురు నొక్కటై నన్ను మోసగించినారు పొమ్ము. [మెడబట్టినెట్టును]

కరం—[పాదములబడి] దేవా! (బలుకబోవును)

విష్ణు—దేవావలదు. ఏమియువలదు పొమ్ము. (అవతలికి గెంటివేయును. మరల) కరంటకా!

కరం—(విచారముతో ప్రవేశించి) చిత్తము.

విష్ణు—నీవు స్వామిభక్తుడవేనా?

కరం—దేవరపాదములే సాక్షిగా స్వామిభక్తునే. స్వామీ

విష్ణు—అట్లయిన నీవీక్షణమేగి. కుసుమపురిఁజేరి, యీ సాయంకాలము లోపుగా తనకూఁతునీయనిచో యీపట్టణంబును కాల్చి భస్మీపటములచే యుమనును. వైశ్యులనెల్ల నరికి రూపుమాపి, చిత్రవధగావింతుననుము. ఈప్రపంచమున వైశ్యకులము సర్వమును నాశనముజేయుదుననుము. శీఘ్రముగాపొమ్ము ఆలసింపకుము.

కరం—చిత్తము [వెడలిపోవును)

విష్ణు—ఇక నేనెందులకు కృతార్థుఁడనుకానో చూచెదను.

(నిష్క్రమించును]

ఇది ద్వితీయాంకము.



# కన్యక

## తృతీయాంకము.



రంగము — పెనుగొండపురసమీపము.

ప్రవేశము — నారదుడు.

నార — కటకటా! ఎంతని తిరుగుదు? ఎంతని వెదకుదు? ఎంత తిరిగినను, ఎంత వెదకినను, నాముద్దుదేవులు నెందును గానరాకున్నవారే! ఎందుబోయియుందురు! కట్టా! సర్వకాలములయందును విధి విరామములేక సంచరించు నాకిప్పుడీ యన్వేషణము మిగులకష్టతరముగానున్నదే! శరీరము స్వాధీనము తప్పిపోవుచున్నది. అయినను నాదేవదేవులజాడ లించుకయు దెలియవయ్యె! అబ్బా! —

ఉ. దేహముసత్వమున్ దొఱగి దీనత జెంది నశించెనయ్యయో!
దాహముచేతనల్కతడి దప్పెను కన్నులుపచ్చవయ్యెడిన్
యూహనశించె బుద్ధినిర యూర్ధ్వతినాకలిహెచ్చె నింకసం
దేహమదేల నేనుకడ దీనుడబోవగరాదె! శంకరా!

అకటా! త్రిలోకసంచారినైన నాకు వీరిజాడలేమియు దెలియవయ్యెకదా! ఓ త్రిమూర్తులారా! అనవరతము మీపరమభక్తుడనై, మీచరణదాస్యమున కాలముగడపు నన్ను మాయావాగురంజిక్కించి మీరంతర్ధానమందినారే! మీదేవేరులుసైతము మిమ్మనుపరింప, తుదకు మీయునికియైన దెల్పుట కెవ్వరును సమర్థులులేక పరితపించుచున్న

ట్టినే! కేవలము భగవత్సంకీర్తనమే జీవనోపాధిగ జేసికొనిన యీభక్తున కింకతరుణోపాయము లేదే! అయ్యయ్యో!

ఓ దైవములారా! ఈపరమభక్తుని మీరిట్లనాదరభావమున చూడదగదు ఇకనైన మీదివ్యదర్శనముల నొసగి నన్ను ధన్యుని చేయుడు.

సీ. శంకరా! పావనా! శంకరా! దేవ! నీ
వీభక్తుబ్రోవరా వేల నేడు
కేశవా! మోహనా! కేశ! లోకేశ! నీ
వీభక్తుబ్రోవరా వేల నేడు
కమలాసనా! కంజగర్భ! యోతండ్రి! నీ
వీభక్తుబ్రోవరా వేల నేడు
శాంకరీ! యోపద్మజా శారదాంబ! మీ
రీభక్తు బ్రోవరా వేల నేడు
గీ. జగములన్నిట వెదకి వేసారినాడ
మిమ్ము కనుగొనజాలక మిగులనేడు
బడలియున్నాడ బ్రోవరే భక్తునన్ను
ఆర్తసంహారులార! ముమ్మూర్తులార!

[ఆలోచన] ఇట్లాకస్మికముగా నందరునొకేసారి మాయమగుట కంతకు స్తరకార్య దురంధరత యేమి వాటిల్లినది. ఎందునకసురబాధలు లేవే! ఇదంతయు నొక ఐంద్రజాలము—గారడి—ఈనారదుని పరీక్షించుటకై పన్నినమాయావాగుర—

(ఆలోచన) సకలలోకంబులును పరీక్షింపబడినవి అన్నియెడలను, నాదేవదేవులను కనుగొనజాలక, ఆశాభంగమునొందితి ఇంకనాపరీక్షకు మిగిలియుండెను గొండపట్టణమొక్కటియే! ఇందుమాత్రము వారుందురా? సకలపాపనాశనకరంబులగు దివ్యక్షేత్రము లెన్నియో విరాజిల్లుచుండ, వివిధదేవతానీక సంస్తుత్యమానంబులైన పుణ్యస్థలము

లెన్నియో విభాసించియుండ, కేవలము సామాన్యమగు నీపట్టణమున గాపురముండుటకా దేవదేవులకేల కల్గును?—

అదే ఈయూరిని జేరి యొకసుందరోద్యానమును, దానినను సరించి యొకదేవళమును గానవచ్చుడి, అందుగూడ బరీక్షించి అనంతరము తరణోపాయము నరసికొందుకు (నిష్క్రమించును.)

ప్రవేశము—కన్యక-విశీతక.

కన్య—వయామయా! అల్లదే మానగరేశ్వరాలయము. నీవిందుండుము నేనేగి నించుకదేవతాదర్శనము గావించునొనివచ్చెదను.

విశీ—అమ్మా! ఆలసింపరాదు. ఈజు మేల్కొన్నచో చాల ప్రమాదము కలుగును. త్వరలో ముగింపుము.

కన్య—శీఘ్రముగనే వచ్చెదమ. (నిష్క్రమించు]

తృతీయాంకము.

రెండవరంగము:ఆలయము.

కన్య—హేసదాశివా!

మ. నిరతంబున్నిను సంస్మరింతు సతముఃన్
నీదివ్యమూర్తిన్ మనో
సరసీజంబున భక్తితత్పరతపూ
జల్ సేతు నీదర్శనం
బరయఃగోరుదు నీమహత్వముఃను ని
త్యధ్యానముల్ సేతు వే
సరితిన్ దర్శనమీగదే! హరహరా!
సర్వేశ్వరా! శంకరా! (తన్మయత్వము]

ప్రవేశము; నారదుడు.

నార—[ఆశ్చర్యముతో] బాపురే! ఎవ్వరీమె? నిండారు భక్తి వాత్సల్యమున తన్మయతవహించి యున్నదే! ప్రాయమున యవ్వనోజ్వ లాంగియయ్యు ప్రాయంబునకు మీరిన భక్తి తేజంబున విరాజిల్లుచున్నదే! ఈమె యెవ్వరైయుండనోపు? అహా!

సీ. వయసు లేఁతయె కాని పడతికి తనువల్లి
ఘనతపోమహిమంబు కలిమిజూపు
కనులయందమె కాని కాంతాకటాక్షంబు
దరిలేని తన్మయత్వంబుజూపు
హృదయమొప్పదు కాని సుదతీమణికి తాల్మి
ఉరుభక్తివాత్సల్య గరిమజూపు;
కరము లల్పమె కాని విరిబోణి శివపూజ
సరిరాని వందనార్చనలజూపు.

గీ. బళిర! ఈలేమకలరెడు పరమభక్తి
దివ్యతపసంయుతంబైన తేజమడరు
మానవాంగనకాదీమె మహినిబ్రోవ
నవతరించిన దేవతా యువతికాని!

ఇక్కాంతామల్లి దరిశనంబున, ముజ్జగంబుల నేకలీలం దిరుగాడిన నాశ్రమమంతయు నెచ్చటనో నశించె; ఈభక్తియవతారమునుగాంచి, కొంతవడియానందించి, పిదప నాదైవముల వెదకెద.

కన్య—దేవాదిదేవా! పుట్టినదాని నిన్నే ప్రేమించి, నీయందే నాహృదయభావంబులనన్నింటిని లగ్నముగావించి, నిన్నే జీవితేశ్వరు నిగ భావించి నన్ను నీవేల కటాక్షింపవు? నీదివ్యదర్శనమొసంగి నన్నేల ధన్యురాలిని జేయవు? నన్నీకష్టతరంపరలనుండి ఏల నుద్ధరింపరావు? మనోహరా! ఈవైశ్యాంగనకింతటితో కష్టములన్నియు నేల తొలగింపవు?

నార—ఈమె వైశ్యాంగనయా! ఎంత ధన్యాత్మురాలు! ఆహా! మానవులయందుకూడ నింతటిభక్తి యుండుటనే నెందును చూడలేదు

కన్య—సర్వేశ్వరా! నాపూర్వజన్మ సంచితఫలం బేమియో కాని నేనిప్పుడే విష్ణువర్ధనుచే మిక్కిలి గారియపెట్టబడుచుంటిని జీవితేశ్వరా ఇకనైన కరుణించి, ఈదీనురాలిని భవత్సన్నిధానమునకు జేర్చుకొనుము.

"శ్లో॥ శివంశంకరం శంభుమాద్యంతశూన్యం
శివాప్రాణనాథం సితాంగంమహేశం
సదాచారమాచారహీనం సురూపం
స్మరామి స్మరామి స్మరారాతిమీశం॥"

(నమస్కారము: తుకియం)

శంకరుడు ప్రత్యక్షమై, కన్యక శిరముపై కరముచాచును.

నార—[సంతోషము.] దొరకెనాజీవనాధారము. ప్రాప్తించె నాజన్మసాఫల్యము. [నృత్యము చేయును.]

కన్య కదలును- నారదుడు డాగును.

శంకరుడు మాయమగును.

కన్య—[లేచి] ఆహా! ఏదియో గంధర్వగానము విని నటులయ్యె! (వెదకి) ఇందెవ్వరును గానరారు. జాగైనది. నాజనకుడీపాటికి వైశ్య సభజరపుచుండును. పోయెదను. (నిష్క్రమించును)

నార—(బయటకువచ్చి] అయ్యో! నాశంకరుడేడి? శంకరా! దీనదయాపరా! హే భక్తవత్సలా! రమ్ము. నీభక్తునకొకసారి నీదివ్య దరిశనమిమ్ము ఈమానవాంగనచేయు సాటిపుణ్యంబేనా నరింపనా తండ్రీ! నేనంత యభాగ్యుడనా? నీకొరకై సర్వజగములును తిరుగుచున్నాడ. నీకింతపరీక్షయేల?

నారదుడు నృత్యముచే
శంకరుడు ప్రత్యక్షమగుయును.ను.

శంక—నారదా! ఈగంతులేమి? ఈగానమేమి? ఈతన్మయత్వమేమి?

నార—(కన్నులు దెరచి) ధన్యుఁడ! ధన్యుఁడ. [మరల నృత్యము)

శంక—మెచ్చితి ఆనందమందితి. ఏల యారీతిని దీనుఁడవై యున్నాఁడవు?

నార—సదాశివా? సర్వజ్ఞుఁడవగు నీకు వేరెజెప్పవలయునా? నన్ను బ్రశ్నించెదవుకాని ఏదైన కలహకారణము లభించునాయని జగంబులదిరుగ వెడలిన నేను మరలివచ్చుసరికే దీనత్వము నొందవలసివచ్చినది.

శంక—నారదా!

గీ. సకలప్రాణికోటి సమయింగాఁబడు
సమరమిావు కోర సాగదేల
జగతిజంతువితతి జంగమృగరాజు
కైనుతించుజంబుకంబుభంగి.

ఎన్నఁడును సంగ్రామము నేకోరిన ప్రజాసంఘంబుల కరిష్టమగు.

నార—ఈశ్వరా! అందులకు నేనేమిచేయఁగలను. బ్రహ్మ నన్నట్లు సృజించె.

శంక—అయిన, కలహకారణమేదైన నీకులభించినదా? సంతృప్తుఁడవైనాఁడవా?

నార—కలహకారణమేదియులేదు కాని; నేను మరలివచ్చుసరికిగొప్ప భయకారణము సంప్రాప్తించినది.

శంక—(నవ్వి) ఏదది?

నార—

సీ. కైలాసమునకేగ కానరారందు నీ
సతియు, నీవును, శైలపతియు నాకు

వైకుంఠపతియు నాపై కోపమూనెనో
యనలచ్చితో మాయ మయ్యెనచట
సత్యలోకముజేర శార్వాణితో నాదు
జనకుడు ధాత నా కనులబడడు
స్వర్గివాసులు మీదు జాడలించుకయైన
గానకమదిలోన గనలినారు

గీ. ఎచటనున్నారొ! ఎందుల కేగినారొ
నిలయముండెనొ? వేళ్కల వెడలినారొ
నచ్చరీకుకు మొదలిడి నామెయనెడి
భయమువాటిల్లె నామది భవవిదూర!

మీరు ముమ్మూర్తులు నొకేసారి మాయమగుటయు, హిమవంతుండును గాన్పింపకుండుటయు, కారణమెఱింగింప తక్కిన యమరులెవ్వరును సమర్థులు గాకుండుటయు వింతకాదే! తదావిగా నీభువనంబులన్ని తిరిగి తుదకీపెను గొండపట్టణంబున నిన్ను గనుగొంటి.

శంక—నారదా! కేవలమజ్ఞానమున లోకసంచారము గావించితివి కాని, ఇంచుక జ్ఞానచక్షుపులం దెఱచి బరికించిన మాయన్న తావు నీకు తెలియదా?

సీ. సతతసద్ధర్మసంగతమైనసజ్జన
గోష్ఠినుండెడు వేద ఘోషయెచట?
తులలేనిదానకీర్తి యలరానాచే నిశ్చ
లత్వముండెడు భాగ్య లక్ష్మియెచట?
కమనీయమౌయజ్ఞ కర్మాదివేదాంత
నియతినుండెడుసత్య నిష్ఠయెచట?
శ్రీవిమలసుస్నేహ భావోజ్వలత మీర
తనరుచుండెడు జాతి ధర్మమెచట?

గీ. సర్వశోభాయమానమై జరగునెచట?
అచటనేమేముకల్గుదుము మంచు మదిని
యెఱుగవా? సకలజగముల కేగనేల?
ధీవిశారద! నారదా! దివ్యమహిత!

ఇంతమాత్రము యోచించినచో మేమందరము నీపెనుగొండయందే నివసించుచున్నామని నీకు దెలిసియుండును.

నార—మీరెల్లరు నాకస్మికముగ సంతర్ధానమగుటచే నేమియుదోచక వ్యస్త చిత్తంబున భ్రమప్రమాద మందితి

శంక—ఇప్పటికైన నీసంశయని వృత్తియైనదా?

నార—ఈ సమయముననాతనువెల్ల యాసంశయావస్థం జెందుచున్నది. ఇప్పుడు నా దేవదేవులును వారిదేవేరులును, ఎచ్చట, ఏయేయవతారముల విరాజిల్లుచున్నవారలో, ఎట్టి కార్యము లాచరించుచున్నవారలో, వారియవతార విరామములెప్పుడో శెలవిచ్చి నన్ను కృతార్థుని జేయుము.

శంక—ఇదియా నీసంశయము. [నవ్వుచు] వినుము. మున్నొకసారి నీవీభూలోకమంతయుతిరిగివచ్చి, అచ్చటి వింతలగొన్నిటి మాకు వచించితివి జ్ఞప్తియందున్నదా ?

నార—త్రిలోకసంచారినగు నేననేకపర్యాయములీభూలోకమున కేగినాను. ఎన్నివింతలనోగని, ఎన్నిటినో మీకు దెలియబరచితిని. అందేవియో ?

శంక—అదికాదు. ఇచ్చట మిక్కిలి దుర్దశం బొందుచున్న జాతిమతవిషయికములంగూర్చి చెప్పినాడవు

నార—ఆఁ- స్మరణకొచ్చినది. అప్పుడీ భూలోకమున జనులు, అద్వైతసిద్ధాంతమునెఱుంగక, శైవ, పాశుపత, గాణాపత్య, వైష్ణవ

శక్తిమతంబులస్వీకరించి, ఆయామతచిహ్నముల ధరించి, పాషండులై పరలోకదూరులగుచున్నారని మీకెరింగించితిని. అవియేనా?

శంక—అవియే! అప్పుడు నేనును, మరికొందరపరిజలును, ఈ భూమినవతరించి, సర్వధర్మవిహీనులైచరించుచున్న జనులను శిక్షించి వారలను సన్మార్గప్రవర్తకులుగ జేయుటకై నిశ్చయించినారము తెలియునా?

నార—(తలనూచి) తెలియును. అప్పుడు మీరును, ధాతయు ఆదిశేషుడును, వాయుదేవుడును, హనుమంతుండును, శాంకరియు నీ భూమియందవతరించి, ధర్మోద్ధారణ చేయునిశ్చయించినారు.

శంక—అంతట నేను—

గీ. మతములను ధర్మముల శృతి స్మృతులబోధ్రవ
శంకరాచార్యుడనగనే జననమంది
'తత్వమసి' 'సోహమస్మి' యే దారియనుచు
ప్రజలబోధించినాడన ద్వైతశిక్ష.

ఆవిధమున నా కార్యము నిర్వహించితి.

నార—అది లోకవిదితమగు విషయమే? అనంతర మాదిశేషుడు రామానుజాచార్యుడుగ భూమినవతరించి, విశిష్టాద్వైతముబోధించి, వైష్ణవశత్రువులను, వారిమతములను ఖండించుటయు—ఆవెన్క వాయుదేవుడు మధ్వాచార్యుడై జననమంది, ద్వైతమతసిద్ధాంతముల బోధించుటయు, సర్వము జగద్విదితములగు కార్యములే!

శంక—కలియుగోద్ధరణమున మేముచేయు కార్యములైనవి. ఇంక మిగిలినవారెవ్వరు?

నార—మాతండ్రి చతుర్ముఖుడును, హనుమంతుండును, శాంకరియు తమభాగముల నిర్వహింపవలసియున్నారు

శంక—నారదా! ఇప్పటికి వారలవంతరుణముసంభవించినది. ఈ

కలియుగంబున వైశ్యులు ధనవంతులైయున్నను. వేదవిహితకర్మల మరచి, మతధర్మంబుల గుర్తెరుంగక, నీతి బాహ్యులై, చరించుచున్న వారు. ఈవైశ్యులు తనభక్తులగుటచే, వారినుద్ధరింప పార్వతియు, ధర్మతత్త్వోపన్యాసాదికంబులగు సుబోధనల కాచతుర్ముఖుండును, నీతిమార్గప్రవర్తనంబునకా హిమవంతుండును, అవతరించినారు.

నార—సదాశివా! ఎట్టివింతలవినుచున్నాను. వారలెచ్చటనున్నారు.

శంక—అందరు నీపురియందే యున్నవారు. విధాత యీపురమున వైశ్యకులగురుడుగా నవతరించి, భాస్కరాచార్యుడునా బ్రకాశించుచున్నవాడు. హిమవంతుడు వైశ్యకులాలంకారుడైన కుసుమగుప్తుడుగ నవతరించి, వైశ్యమతధర్మంబులకు మార్గప్రవర్తకుడై విరాజిల్లుచున్నవాడు.



నార—అంబ శాంకరియో!

శంక—ఓయీవెర్రివాడా! కనులారగాంచియు నింతమాత్రము గ్రహింపవైతివికదా!

సీ. ఏనాతిసౌందర్య మీక్షింపరంభాది
    యప్సరోతతిగర్వ మడపజేయు
ఏనాతిధిషణావిధానంబుగనబృహ
    స్పతి మహత్వంబు సడలజేయు
ఏనాతిశివదీక్ష యింపార నినుబోలు
    భక్తవర్యులవింత పడగజేయు
ఏనాతిధర్మసంధానాతిశయమువ్వి
    జనులసన్మార్గవర్తనుల జేయు
గీ. ఏసతీమణి కరము నిన్నిపుడెహర్ష
    సాగరంబునముంచె నే సాధ్వినేను

చూడనే తెంచితినో యట్టి సుగుణవల్లి
కన్యకామణి యాపెశాం కిరియెసుమ్ము.

ఆమెయే కుసుమగుప్తునితనయ కన్యకనావిలసిల్లుచున్నది. పూర్వజన్మవిజ్ఞానంబుమాత్ర మీమెకులేదు భక్తులకొరకు, ధర్మోద్ధరణకు, కోరికొని పలుకష్టములనొందుచున్నది. ఆమెనుగాచికొని నేనిందున్నాడను.

నార—ఓహోహో! అనన్యసాధారణమైన తపోనియతిచే, నింతకుమున్ను నిన్నుసేవించి, నాహృదయాకర్షణము గావించిన సతీతిలకము శాంకరియా! ఎట్టి యద్భుతముగాంచినాడ?

శంక—నారదా!

గీ. జీర్ణమై నామమాత్రావ శిష్టమైన
వైశ్యమతధర్మముఁబోచి వైశ్యసాంప్ర
దాయముల నుద్ధరించియీ ధరణివైశ్య
భక్తులనుబ్రోవబుట్టుపా ర్వతియె యూపె.

నార—ఈశ్వరా! లక్ష్మీనారాయణులును, నాజనయిత్రియగు సరస్వతియు నెచ్చట?

శంక—లక్ష్మీవైశ్యులనాశ్రయించె, నారాయణుడు లక్ష్మినను సరించి నావలెనే నాపురంబున జనార్దనుడై వెలుగొందు. సరస్వతియు నిప్పుడీవైశ్యకులంబునజేరి, వారల నిగమాగమకోవిదులుగా జేయుచున్నది.

నార—మహేశ్వరా! మరలమీరెల్లరు మీమీయవతారంబుల నెల్లప్పుడు చాలింతురో శలవీయవేడెదను.

శంక—(నవ్వుచు) నారదా! ఇప్పుడొకనూత్న నాటకము ఖేలనమగుచున్నది. నాయిక మనకన్యకయే! రాణ్మహేంద్రరాజ్య ధర్మాధీ

శ్వరుడును, నానారాజవిజయముగావించి, ప్రస్తుత మీపట్టణంబున విడసియున్న విష్ణువర్ధనుడు ప్రతినాయకుడు. ఈనాటకాంతమున మే మందరము నవతారముల చాలించెదము.

నార—దేవాదిదేవా! ఈనాటకాంతమెప్పుడో యదికూడ నాకు దెలుపరాదే!

శంక—అయ్యది నీతండ్రిప్రయత్నముపై నాధారపడియున్నది. ఆతనికొక్కనికే పూర్వజన్మవిజ్ఞానంబున్నది. పోయినీతండ్రిని గలిసికొనుము.

నార—(నమస్కరించి)

గీ సకలజగములతిరిగిన శ్రమనశించె
వింతవింతల వినవిన వేడ్కలలరె
మువురుమూర్తు లను గొన మోదములరె
చూడచూడంగ నేనె ధన్యుడనుతండ్రి.

(నిష్క్రమింతురు)

అవనికజారును.





# కన్యక

## చతుర్థాంకము.



రంగము:వైశ్యసభ.

(కుసుమగుప్త, విశ్వగుప్త, సోమగుప్త మొదలగు వైశ్యులు, భాస్కరాచార్యులు, ఆసీనులై)

కుసు—[లేచి] వైశ్యప్రముఖులారా! హితులారా! మీరందరు ఇప్పుడేకారణమున పిలువబడిరో మీకంపబడిన యాహ్వానపత్రమునందే వచించియున్నాడను. వ్యవధిలేకుండగనే యీమహాసభ జరుపబడవలసివచ్చెను మీరందరు నాయాహ్వానమును మన్నించియింతత్వరితగతి నీసభనలంకరించినందులకు మీ కెంతయు కృతజ్ఞుడను. ఇంకప్రస్తుత కర్తవ్యతానిశ్చయము గావింపవలసియున్నది. శ్రీరాజమహేంద్రరాజ్యపాలకుడు విష్ణువర్ధనమహారాజు జైత్రయాత్రసలిపి మరలివచ్చుచు మన పట్టణమున విడియుటయు నేనువారికి సమస్తసన్మానసౌకర్యంబుల గావించి గారవించుటయు మీకెల్లరకును తెలిసిన విషయమే!

భాస్క—కుసుమగుప్తా! విరమించుము. మిగిలినది నేవచింతును. శిష్యులారా! ప్రస్తుతాంశమును మీరతిశ్రద్ధగావినవలయును నిన్నటిదినమున మీ ప్రతినిధి ముద్దులకొమార్తె కన్యక శివపూజార్థమై పుష్పములకొర కుద్యానమునకుబోవ, విష్ణువర్ధను డాసమీపముననే యుండి యామెనుగాంచి మోహించి, యేవియోదుర్భాషలాడుటయు, ఆవెనుక రాజు స్వయముగా మారువేసముబూని, రాయబారిగ నరుదెంచి యీకుసుమగుప్తుని తనయనుపరిణయమాడగోరుటయు, ఈబాం

ధవ్యము ధర్మవిహితమైనది కాకపోవుటచే రాజునకీ కన్య నొసంగుటకు వీలు లేదని యీకుసుమగుప్తుడు బలుకుటయు, రాజుకోపించి, నేటిసాయంకాలములోపుగా నాకన్యకను తనకిచ్చి పరిణయ మొనర్పనియెడల తానీ వైశ్యులబిలుకుమార్చి, యీపట్టణము నాశనము గావించి; యీసాయంకాలములోపుగా మీకన్యకను బడయుదునని పల్కి వెడలిపోవుటయు, మీకు మాచారులమూలమున దెలసియేయున్నది.

విశ్వ—(చెవులుమూసికొని) శివ శివా! గురువర్యా! ఇక చాలును. వచింపకుడు. ఓరీ! విష్ణువర్ధనా? ఏమిపనియొనరించితివి?

చ. గరువముతోడ నీకిటు
కాంతను బల్మిని బట్టనెంచినా
వుర ఖలచిత్త నీబలిమి
పోటుతనంబిదె గాంచువాడ; సం
గరముఖమందు గుప్తకుల
ఖర్వమహాభుజశక్తి గాంచకుం
డ, రయమునగ్రహింతువొకో
డాయగ నీతరమౌనె! దుర్మతీ!.

శా. ఔరా! వాసవిబట్టుకోపడవునీ
వామేనుజీవింపగన్
ఘోరాజిన్ ఘనబాహుదర్పమున నీ
క్రోధంబుగేల్పేయుచున్
హోరాహోరి పెనంగి గెల్పుటయొ? కా
దో విశ్వవిఖ్యాతిగా
వీకస్వర్గముగాంచుటో! పిటుల దో
ర్వీరత్వమం పెంచుమూ!
చూడుమిక నీగతి యేమికానున్నదో! [కత్తి దూసిపోబోవును]

సోమ—(వారించి) చాలు. చాలు. నీకు మతియున్నదా లేదా! కాకున్న మహాపరాక్రమసంపన్నుఁడగు రాజెక్కడ! నీవెక్కడ?

మ. బలగర్వంబున కన్నుమిన్నుగనకీ
భంగిన్ మహాశూరుడై
యిలరేఁడొప్పును; వానిఁడాయతరమా
నేనీకు నీతాతకున్
పలువాక్యంబులికేల? తాళుమిక నీ
ప్రాణాల కాశింపుమా
గెలువన్ జూతువె! మేటిశూరుఁడవె కా
కీడెంచి మేలెంచుమా!

విశ్వగుప్తా! నీదుడుకుతనమెల్లవేళల పనికిరాదు. నీదుడుకుతనమువలన మనవైశ్యసంఘంబున కెంతటి చేటువాటిల్లునో యెఱుగుదువా? నీయీచెయ్వులు రాజునకు దెలసినచో వానికి మిక్కుటముగ నలుకపొడము.

గీ రాజునకు నలుకపొడమ దర్పంబుమీర
కినుకబూనుచు నరుదెంచి కిరటుకోటి
తునియతునియలుగా జేసి తుదకుకన్య
బలిమినైనను గ్రహించు వాఁడునిజము.

విశ్వ—ఛీ! పిరికిపందా! నూతనముగా నీవీగుప్తులకు పిఱికితనముదోబ్ధించుచు నవాచ్యము లాడుచుంటివిగా! గుప్తకులకళంకా! నీమూలమున నీగుప్తకులమపవిత్రమై పోవుచున్నది.

సోమ—విశ్వగుప్తా! వెనుకముందులరసి మాటలాడుము. కుసుమగుప్తా! వినుచుంటివా? నామూలమున నీగుప్తకుల మపవిత్రమైపోవుచున్నదట! నేనుగుప్తకులకళంకుడనట! ఈతనికివలె వెనుకముందులరయక మేలుకీడులెంచక వైశ్యనాయకుని యభిప్రాయమునకు తాళము

వైచుచు నాతని దయకు పాత్రుడను గాకపోవుటచే నేను కళంకుడ నైతినో లేక నిష్కారణముగ రాజాగ్రహమున కేలపాత్రులయ్యెదరని. నేజెప్పినందున కళంకుడనైతినో! విశ్వగుప్తా! నీవలె యీవైశ్యులనందరి నొక్కమాటు విష్ణువర్ధనుని బారిపడి చావమని నేనుబలుకుటలేదు. నీవలె యీగుప్తనాయకుల నందరిని కత్తులబూని లేనిపోని యారాటము తెచ్చిపెట్టుకొనుమని నేనుద్బోధించుటలేదు నీవలె యీగుప్తశేఖరుల నందరిని ధనుశ్శరములబూని విష్ణువర్ధనుని యాగ్రహానలంబున కింధనమై సమయుడని నేబోధించుటలేదు. కాని వీరలందరిని యించుక జాగ్రత్తగానుండుడని బలుకుచుంటిని.

విశ్వ—ఛీ! వాగకుము నీవలెనే నీవైశ్యులను గుండెలరచేతి యందుబట్టికొని పారిపొండని బోధించుటలేదు. తరతరంబులనుండియు' నిష్కళంకమై, పరిపూర్ణకీర్తి తేజంబున వెలుగొందు వైశ్యప్రితాపధనంబుల విష్ణువర్ధనుడపహరించుచుండ తేలకన్నులవైచుకొని చూచుచుండుడని చెప్పుటలేదు పిరికిపందా!

వె. పలువ! గుప్తశౌర్య! భాగ్యలక్ష్మికినీవు
పిరికితనము నేర్ప వెడలినావె
ఇట్టి భీరుజనుల కియ్యదియేశాస్తి
పొమ్ము! వాడవాడ పొట్టకొరకు.

(తన్నును)

సోమ—సభాసదులారా! చూచితిరా యీదురాత్ముని కండకొవ్వు! చెట్టుచెడు కాలంబునకు కుక్కమూతిపిందెలు పుట్టునట్లీతని చెడుతలంపులవారింపక, నన్నీ పేరోలగమున నీతడుపరిభవించుచుండ చూచినారలుకదా; రాజు బలవంతుడు-గట్టిగాతలచిన మనలను, మనపట్టణమునుగూడ నాతడు విధ్వంసమొనరింప జాలినవాడు. ఇంకమనమో, వాణిజ్యము

నసుఖముగా కాలముగడుపుచు, శాంతభావమున నడచుకొనువారము ధైర్యసాహసముల నుపయోగింప మనము సమర్థులముకాము. కావున మనమీ రాజునకు చేతులజోడించి యతనియభిప్రాయమును సార్థకతకు దేవలయునని చెప్పబోవుచుండ నన్నీ విశ్వగుప్తుడవమానించె. ఇందేమి యుక్తమో మీరే యోచించుకొనుడు సుసునుగుప్తా! మాటాడవేమి?

కసు—(కోపముతో) ఏమి మాటాడవలయును? నీవు బోధించు విషయము లర్థమూఢములని జెప్పవలయును? లేక నీవంటి జ్ఞానవిహీనులు తమలోనొకనాయకునిగ నెన్నుకొన్నందులకీవైశ్యసంఘంబు లదూషింపవలయునా? ఛీ! సోమగుప్తా ఎంతహేయమగు వాక్యంబుల నుగ్గడించుచున్నావు? గుప్తవంశమున వేయేండ్లు గాలించినను గానరాని భీరుత్వమీ వైశ్యసోదరుల హృదయాంతరాళమున బ్రవేశపెట్టుచున్నా డప్ప కేవలము ధనమే ప్రయోజనకారి యనియు, ధనేతరములు వ్యర్థమనియు మనమందరము నామమాత్రావశిష్టులమై, యేమూలనో బడియుండవలయుననియు నీయభిప్రాయము కాబోలును వెఱ్ఱివాడా! ఎంతటి యజ్ఞానవారాశిలో మునిగియున్నాడవు? గుప్తులమహోన్నతి దెలసినవారెవ్వరైన నీగతియనామకులై ప్రవర్తింపజాతురా? గుప్తులరాజ్యనిర్మాణచాతురీధురీణత్వము నెరింగినయెవ్వాడైనను ధైర్యసాహసముల నీవలె జంకికొని, పిరికితనమవలంబించగలడా? గుప్తవంశీయులపవిత్రతమగు రక్తము తనశరీరమున ప్రవహించు యేగుప్తసోదరుడైనను, అజ్ఞానాంధకారమునబడి దారి తెలియక నీవలె భయపడగలడా? వైశ్యసోదరులారా?

సీ. 'కణ్వాయనా' రాజ్య కలిమివాసితొలంగి
శిథిలమై నామావశిష్టమగుట
ఆసేతుహిమశైల మాక్రమించినమౌర్య
రాజ్యంబుభిన్నమై రాణచెడగ

సమరస్థలిని గుప్త శౌర్యంబు చూపించి
జగదేకవీరత పొగులలేదె?
'మగధ' 'బీహారు' ల మదమెల్లనడచి రా
జ్యస్థాపనము చేయ జాలలేదె
గీ. వివిధ రాజ్యంబులను గెల్చి వీరవర్య
దనగ నార్యావర్తమున పెద్ద యశముగాంచి
చక్రవర్తిగ ధరనేల సాగినట్టి
గుప్తుడన వైశ్యభూనాయకుండుగాడె!

మరియు.—

గీ. శకులు బౌద్ధులు క్రూరులై జగతి బ్రహ్మ
జాతి పమయింప నెంచిన సమయమందు
బ్రాహ్మణుల బ్రోచి సంస్కృత భాషగాచు
పోషి రారాజు చంద్రగుప్తుండుగాడె!

గుప్తసోదరా! అటి మనపూర్వచారిత్రమింక జ్ఞప్తికి దెచ్చుకొనుము

విశ్వ—మరియు నో సభాసదులారా! భక్తిభావంబులచే చరణంబుల సేవించు సకలసామంతమండలము గూడి విరాజిల్లుచున్న 'మహారాజాధిరాజపరమభట్టారక' ప్రథను చంద్రగుప్తుండును, గుప్తవంశవ ధ్యాం దినమార్తాండుడై, కౌసంభినగరమును రాజధానిగా జేసికొని, ఆసేతు హిమాచలపర్యంత మీహిందూదేశ పరిపాలనము గావించిన సముద్రగుప్తుండును, ఇంకను రెండవ చంద్రగుప్తుండును, స్కందగుప్తుడు మొదలలైనవారలందరును, వైశ్య కులాలంకారులై, దిగంత విస్తార యశోవిరాజితులై రాజ్యము లేలలేదే! అట్టిమహామహులపవిత్రతరము రుధిరమే మనశరీరమున ప్రవహించుచున్నది. మనమిప్పుడీ రాజమార్గమునకు జంకితిమా తరతరంబులనుండియు నిష్కళంక తేజోజ్వలమైన మనగుప్తయశస్సామ్రాజ్యవినాశనమునకు మనమే ప్రథమకారకులము,

ఈసోమగుప్తుడు మనకును, మనవంశమునకు నపకీర్తి తేజూచుచున్న వాడు మీరు వీనిమాటలవిశ్వశింపకుడు.

కుసు — సోమగుప్తా!

సీ. భక్తిభావంబుల పాదముల్ సేవించు
సకల సామంత సంపదమువీర;
కరకు కత్తులతోడ నరికోటి నడలింప
నిరవంక సద్భటుల్ మెరయుచుండ
ఏదలేటిబంగారు సారసంబులమించు
వింజారములు మీద వీచుచుండ
రాజమహారాజ రాజభట్టారక
యంచు మాగధులు కీర్తించుచుండ

గీ. హేమసింహాసనాశీనుఁడైన గుప్త
రాజమధ్యాహ్న కుల మార్తాండు డలరు
టెరుగవే! మరచినాడవె. ఇంటలేని
వెరపునొందెదవేల? యో కిరటువర్య!.

భాస్క — ప్రస్తుతాంశము పూర్ణముగ నెరుంగకయే, మీలో మీరిట్లు కలహించుకొనెదరేల? వినుడు. అట్లారాజు మనసభనుండి వెడలిపోయి, సాయంసమయమున, శంకరుపూజా తత్పరయై నగరేశ్వరాలయమునకుబోవు వనకన్యకం బట్టి తనశిబిరమునబంధించె. కావున మీరెప్పుడేది యొనరించినబాగుగానుండునో నిశ్చయించి కార్యక్రమమునకు గడంగవలయును.

కుసు —

గీ. ఏది ధర్మంబో? అద్దాని నెట్టు నిర్వ
హించుటయో మీరుచక్కగా నెంచవలయు
ధర్మపథ రక్షణాసంవిధానమందు
వలయునెడ ప్రాణధనములనైన వదల వలయు.

గీ. కన్యకామణియేమొ నాకన్నకూతు
రంచుమీామదినింతైన యెంచవలదు
అందఱకుధర్మమొక్కటే యగునుగాన
అట్టిధర్మంబెయోచింప నగునుమీాకు.

(సభ్యులొకరివంక నొకరుచూచుచుందురు.)

భాస్క—మీారీపర్యాలోచనమందు జాగొనరించిన లాభము లేదు. కాలమతిక్రమించుచున్నది. రాజిడిన గడువునకు వ్యవధిచాలదు సోమగుప్తా! ముందు నీయభిప్రాయమును దెల్పుము.

సోమ—నాకుపరిగ్గైన సమాధానమిచ్చినచో, నన్నాశ్రయించుచున్న వైశ్యుల యభిప్రాయములకూడ తెలిపెదను.

కుసు—నీపక్షమునన్నున్న వైశ్యులెందరు?

సోమ—నాతో 612 గోత్రములవారము

కుసు—అయిన నీసందేహముల దెలుపవచ్చును.

సోమ—మీాతనయకు వివాహమైనదా?

కుసు—లేదు

సోమ—లేదు ఆమెనెవరికీయ నలచినారు?

కుసు—ఇంకను నిశ్చయముకాలేదు

సోమ—నిశ్చయములేదు.—ఈవిషయమురాజెరుంగునా?

కుసు—వివాహముకాలేదనిమాత్రమే యెరుంగును.

సోమ—పోనిండు. కన్యకరాజును ప్రేమించినదా?

కుసు—లేదు.

సోమ—మరియెవరిని ప్రేమించినది?

భాస్క—ఎవరినా? మననగరేశ్వరుని.

సోమ—[ఆశ్చర్యము] నగరేశ్వరునా?

భాస్క—ఔను.

సోమ—[హేళనగ] ఆలయములోని శిలావిగ్రహమునా ? లేక సాధారణమానవాంగ్మాన సగోచరుండగు నీశ్వరునా?

విశ్వ—(కోపముతో) ఓయీ! అవివేకీ! ఇది పరిహాసమునకు సమయముకాదు. వెర్రిమొర్రిప్రశ్నముల నిడక నీయభిప్రాయం బేదియో తెలుపుము.

సోమ—నాకు వెర్రియో లేక నన్నధిక్షేపించు నీకు వెర్రియో ఇందరియెదుట వాదించెదను వినుము సభ్యులారా! కేవలమువాంగ్మా నసగోచరుండగు నీశ్వరునీమెభర్తగా బడయ నెంచినదట! ఈమెయో సామాన్యమానవాంగన! పంచభూతాత్మకంబగు స్థూలశరీరమున విరాజిల్లుచున్నది. భగవంతుడన నెవ్వడో, ఎట్టులనుండునో యెరుంగదనియే మానమ్మకము. అట్టి యీశరీరధారిణి ఆమహాదేవుని వరించుట కేవలము హాస్యాస్పదము.

పోనిండామహాదేవుడు సర్వాంతర్యామి కావున మన నగరేశ్వరాలయమున బ్రతిష్ఠింపబడిన శివలింగమునందును యున్నాడనుకొందము. దానినే యీమె వివాహమాడుననుకొందము. దానిని వివాహమాడినచో కేవలమీశ్వరునే వివాహమాడుచున్నట్లు వీక్షించుచుండవలయు. అట్లు దలంచినను,

గీ. మానవాంగన కాయవాంగ్మన సగోచ
రుండు పతియౌనె యేరాతి బండగాక!
దర్పణంబున దోచుశ్రీ తాంశుబడయ
వచ్చునే చేతనున్న దర్పణమెగాక!

కావున ఈమెకులభించు భగవంతుడెవ్వరు? మనయాలయము లో భగవంతునకుమారుగా బ్రతిష్ఠింపబడిన యాశిలయే.

కుసు—చనవిచ్చినకొలది యసంబద్ధములాడెదవేమి? నీకిష్టమైన యెడల ప్రస్తుతకార్యావసరమున నీయభిప్రాయము తెల్పుము. లేకున్న

ఊరకుండుము. అక్కరకురాని విషయంబుల బ్రస్తావించకుము.

సోమ—నాయభిప్రాయమున కేమున్నది?

ఉ. రాజువరించె నీమె నను
రాగముమీరగ వానిమైత్రి వి
భ్రాజితమై చెలంగు మన
వైశ్యకులంబునకెల్ల గాననా
రాజనకీమె నిచ్చుచు గ
రంబు వివాహము సేయ శ్రేయమా
యోజలు వేయునేల కడు
యోగ్యము నీకిది గుప్తనాయకా!

గీ. పంతమున రాజు కన్నియ బట్టినాడు
వాని కిప్పటి కామె స్వాధీనయగుట
నిక్కమిక పెనగులాడుట దక్కనేమి
కార్యమగు రాజరాజు కాగ్రహముగాక!

రాజు కాగ్రహము కలిగినమనల లాతడేమిచేసినను చేయగలడు.

భాస్క—[కోపము] ఛీ! రాజో రాజని భయపడెద వేమి? రాజామెను తనశిబిరమున బంధించిన బంధింపనిమ్ము. ఆమె యాతనికి స్వాధీనయగుటయా—

గీ. ఇట్టి వేయి రాజు లిరువది వేవురు
రాజరాజులైన రమణి యొంటి
కాలిగోటినైన గాంచనేరరు ఇంక
బడగువర్ధనుండె బట్టువాడు!

చాలునిక నీధర్మతత్వోపన్యాస మూరకుండుము. విశ్వగుప్తా! నీయభిప్రాయమేమి?

విశ్వ—తక్షణమే నాహితులతో నేగి రాజశిబిరమును ముట్టి

డించి కన్నియం చెత్తును. అటుల దెచ్చిన మన కులగౌరవంబును గాపాడుకొన్న వారమగుదుము. ఒకవేళ నేనీకార్యమందు మరణించినను ధర్మకార్యోద్ధరణకై ప్రాణముల నర్పించితిరనుఖ్యాతి ఆచంద్రతారార్కముగా లోకమున నిలచియుండును.

కుసు—[విశ్వగుప్తుని కౌగిలించి] హితుడా! నీమేలెన్నటికైన మరువగలనయ్యా! సోదరుగుప్తా! నీవును నీ 612 గోత్రముల వారునుగుప్తకులకలంకులై గుప్తవంశమున పిరికితనము ప్రబోధించినవారిలో మొదటివారలై మాయాయు ప్రజాగ్రతగా నచేతబట్టికొని లోకమున చిరకాలము వర్ధిల్లుడు. మీసహాయము నాకేమియువలదు.

ప్రవేశము; కన్యక విభీతక.

అందరు—[ఆశ్చర్యము] కన్యక! కన్యక! కన్యక.

కుసు—(ఆనందముతో)

ఉ. మాయయొ? నిక్కువంబొ నను
మానములేదొకొ! లేక భ్రాంతియో
నాయెదుటన్ చరించునది
నాదుసుపుత్రియొ! తల్లి! నీవెకా
దా! యెటువచ్చితమ్మ! జన
పాలుడు నిన్నెటు వీడెనమ్మ! గ
ర్వాయతమత్తచిత్తుడగు రాజునశించెనటమ్మ! కూతురా!
[కౌగలించును]

కన్య—ఆశంకరుకటాక్షమే వానిమూర్ఛగావించి నాకీ యామునీహయుని (విభీతకనిజూపి] జూపించి నన్ను విముక్తురాలినొనర్చె. తండ్రీ! మీరిపుడేది నిశ్చయించినారు?

కుసు—మేమందరము నరుదెంచి రాజుశిబిరమును ముట్టడించి నిన్ను విడిపించుటయో లేక మరణించుటయో యని నిశ్చయించినాము.

కన్య—నేను రానేవచ్చితిని. ఇకమీఁదటి కర్తవ్యము?

విశ్వ—నీవు వెడలివచ్చితివను తలంపున మహారోషముతో రాజ రుఁడెంచి దౌష్ట్యమునకు గడంగును. ఆతఁడెన్ని యకృత్యము లొనరించి నను ధర్మరక్షణార్థము. నిన్నా విఘ్నవర్ధనుని పాలబడకుండఁగా కాపాడుట యే మావిధి.

కన్య—ఆతఁడు బలవంతుఁడు.

విశ్వ—బలవంతుఁడైన మనలనాతఁడేమిచేయగలఁడు? తుచ్ఛము గునీశరీరమును నశింపఁజేయునుగాని, ఆత్మల వధింపఁజాలఁడు. ఈధర్మ కార్యోద్ధరణమునమరణించినచో, లోకమున ధర్మరక్షకింకను తావుం డును.

కన్య—అట్లయిన మీరందరును మరణమునకు సంసిద్ధులుగ నున్నారా?

విశ్వ—నిస్సందేహముగ.

సోమ—లేదు; లేదు; నేనును, నామంత్రులగు 612 గోత్రములవారమును ఇందుల కంగీకరింపము. ఇష్టమైనయెడల మీరందరును ప్రాణపరిత్యాగము నే గావించుకొనుఁడు. మేముమాత్రమీవిషయమున రాజాభిప్రాయలనే యనుసరింతుము. నిష్కారణముగ మేముచావ నేల?

కన్య—(రోషముతో) మీరు చచ్చుట నిష్కారమా! ఛీ నీచులారా! ధర్మముకన్న ప్రాణములనెక్కుడుగా నెంచికొనుచున్న వారా? తుచ్ఛములగు ప్రాణముల కాశించి, ధర్మవినాశన మొనరింప సంకల్పించుకొనిన మీ 612 గోత్రములవారును పవిత్రమైన వైశ్య నామధారణంబునకు పాత్రులు కారు. రాజ పాదస్పర్శమున కంగీకరించి, పవిత్రమైనధర్మమును రూపుమాపఁదలంచిన మీరందరును కులభ్రష్టులై వేదబాహ్యులై యపవిత్రులైనారు. మీప్రకమ నయంపతగదు నిష్క

కళంకమై, నిర్మలయశశ్చంద్రికా ప్రభాభాసురమైన గుప్తపుత్రాపానలంబును పిరికినీటిచే నారుపయత్నించిన మీకీశిక్షతగును ఓరోరి, వైశ్యకులకళంకులారా! మీ 612 గోత్రములవారును —

గీ కులయశంబునీడి గుణహీనత; వైశ్య
సాహసములు చావ జగతియందు
పిరికితనమె మీకు బ్రియమగునట్టుల
పొందు! వాడ వాడ పొట్టకొరకు.

సోమ—(పరివారముతో వెడలిపోవును.]

విశ్వ—పోవపోయిరవి ఇక మా 102 గోత్రములవారమే చాలుదుము నిన్ను సంరక్షించుటకు.

కన్య—తండ్రీ! దినరాజు పశ్చిమ దిగ్మండలమున ప్రవేశించు చున్నాడు. ఆలసించిన లాభము లేదు. జనకా! రాజు బలవంతుడగుటచే నీధర్మయుద్ధమున మనలకు వీరస్వర్గమే లభించును మన మారాజు నెదుర్కొనులోపున- జనకా!- నాకొక చిన్న ముద్దుకలదు. ఇదియే కన్నతండ్రి నాకు దీర్చుకడపటి కోరిక—

కుసు—[విచారముతో) హా! తనూజా!-

గీ. చిన్నతనమునుండి చేతులలో నిన్ను
ముద్దులొలుక బెంచి మురిసినాను
గాని, విందునీదు కడసారికోరిక
యంచు నింత యెరుగనైతి పుత్రి!

కన్య—జనకా! ఇది విచారమునకు సమయము కాదు. వ్యవధి చాలదు.

విశ్వ—[తనలో] ఆశ్చర్యము! హిమవంతునివలె చలింపని యీ మహానుభావుడు, నిజపుత్రికావిచారంబున నెంతయు గుమిలిపోవు చున్నాడు.

కుసు—కుమారీ! ఇంతకన్న నీకు నేనేమిచేయగలను? వచింపుము.

కన్య—తండ్రీ! [నమస్కరించి] రాజరుదేరకపూర్వమే నన్ను మననగరేశ్వరునకిచ్చి వివాహముచేసి నన్ను ధన్యగాఁజేయుము. నేను నాప్రాణేశ్వరుఁడైన, నామనోహరుఁడైన శంకరసాన్నిధ్యముం జేరెద. మీరందరు వీరధర్మమవలంబించి గుప్తపవిత్రచారిత్రమున ప్రాణంబులర్పించి స్వర్గద్వారంబులఁజేరుఁడరీ, నేనగ్నిఁబ్రవేశించి, నామనోహరుని జేరెద!

కుసు—[శోకముతో] అయ్యో! పుత్రీ! నాకన్నులయెదుట నీవగ్నిఁబడి మృతినొందెదవా? అయ్యయో! దైవమా! తుదకు నాజీవితము నిట్టిదుఃఖభాజనముగా నొనరించితివి.

కన్య—నేను మృతినొందను. నాస్థూలశరీరమంతరించును. నాకు వివాహముచేసి. ఆ సమీపముననే యొకఅగ్నిగుండము నేర్పరచినచో, నేనాయగ్నిద్వారంబున నాప్రాణేశ్వరు సన్నిధానమునఁ జేరెద. శివునకగ్నిప్రియము. నాకునుప్రియమే! అగ్ని నాకేమియు నపాయము కలుగజేయదు కావుననే నగ్నిబ్రవేశించువరకు నన్నా రాజదృష్టినుండి గాపాడి పిదప మీరు వీరధర్మమనుసరింపుఁడు.

భాస్క—[ఆవేశముతో గంతులిడుచు] ఓ చండీశ్వరా! ఎందున్నావు? భృంగీశ్వరా! బలుకవేమి! రండు! రండు! ఓ ప్రమథగణంబులారా! పరుగిడిరండు. అప్పా! రారేమి! మీతల్లి-గౌరి-శాంభవి-శాంకరి-గిరిజ-మీ యేలికభర్త సన్నిధానమునకరుదెంచుచున్నది. అయ్యయో! ఎవ్వరునుపలుకరేమి? ఆమె యొంటరిగ రాగలదా. మీరు మీజననికి తోడురారాదా! ఎచ్చటనున్నారో! నేనేపోయెద! జననీ! లోకమాతా! ఈశ్వరీ! రమ్ము రమ్ము. ఇదియే దారి

గీ. జననీ! పార్వతి! తల్లిరో జాగికేల
రమ్ము! నీవెంట నేతోడు రాదలంచి

నాడ జగదంబ! ఈశ్వరి! నేడు నేనె
సృష్టికర్తను నీకిదే సేవచేతు!

[కన్యక పాదములు బట్టికొనబోవును]

కన్య—గురువర్యా! ఇదేమివిపరీతము. నేను మీ శిష్యురాలిని. కన్యకను- ఇటుచూడుడు అయ్యో! మతిచలించినదా! జనకా! విశ్వగుప్తా చూచెదరేమి? గురువర్యా! మీరు గురువులు. నేశిష్యురాలను- నాపాదముల బట్టుకొందురేల?

భాస్క—[లేచి కన్నుల దుడిచికొని) నేనిప్పుడేమిచేసితిని

కన్య—ఏవియో పరాకుమాటలాడితిరి

భాస్క—అబ్బే! కొంచము మతిచెలించినది. ముదుసలినికాదా మరి- ఆఁ-కుసుమగుప్తా! ఆలోచింపకుము. ఈమెకోరిక నెరవేర్చుటకు వెంటనే తగుయేర్పాటుల గావింపుము.

కుసు—చిత్తము.

ప్రవేశము కరంటక.

కరం—ప్రతినిధికి స్వాగతము. మీకన్యకను మామహారాజు గారికీసాయంకాలములోపుననిచ్చి వివాహముచేయనిచో, మిమ్మల నందరును, ఓలుకుమార్చి, యీమెను గొనిపోవుదునని మామహారాజు మీతో మనవిసేయుమనె. ప్రత్యుత్తరమిండు.

భాస్క—(కుసుమగుప్తునితో జనాంతికముగా) ఇప్పుడీరాజునకు వ్యతిరేకముగా చెప్పిన మనప్రయత్నములన్నియు వ్యర్థములగును. నే ప్రత్యుత్తరమిచ్చెద నీవూరకుండుము. (ప్రకాశము) అయ్యా! ఈసా

యంకాలము ఘం 26-49 విఘడియలకొక సుముహూర్తమున్నది. అప్పుటికి మీప్రభువువారు మంగళవేషధారులై యరుదెంచినచో మాకార్యమును మేము నిర్వహింతుమని చెప్పుము. ముహూర్తమింక నాలుగైదుగడియలే యున్నది. త్వరలో జరుగుము. మేమును ఈలోపున వివాహసన్నాహ మొనరించుకొనవలయును.

కరం—చిత్తము. నిష్క్రమించును.)

భాస్క—మనమీలోపున నన్నియు ముగించుకొని రాజు నెదుర్కొనవలయును నడువుడు.

తెరదిగును.

ఇది చతుర్థాంకము.







# కన్యక

పంచమాంకము.



రంగము వీధి

ప్రవేశము భాస్కరాచార్య

భాస్క—ఔరా! కన్యకాపరమేశ్వరీవిలాసము!

చ॥ ధరణినేకవత్సర
శతంబులుఘోరతపంబుజేసిని
న్నరయగగోరుమానులకు
నైనలభింపనితల్లినీవు,బా
పురె?యిటువైశ్యభక్తులను
బ్రోవగపుట్టితివమ్మ!నీదుసా
దరమగుభక్తరక్షణము
తల్పతరంబగునమ్మ!శాంకరీ!

గీ॥ వైశ్యకులమునవీవాడు పడుచువైయ
పారమగుకష్టములనెల్ల కోరికొనుచు
ధరణినాదర్శముగనీవు తనరితమ్మ
బళిర!నీభక్తరక్షణ భాగ్యమహిమ!
అదృష్టమన నీవైశ్యసంఘుంబులదే యదృష్టము-ఏలనన-

సీ॥ మూవురుమూర్తులలోన మొదటివేలుపు నేనె
వైశ్యగురుండనై వరలుచుంట

ధర్మోపదిష్టభూ ధరనాయకుండు తా
వైశ్యపాలకుఁడౌచు వరలుచుంట
భక్తవత్సలకృపా పరిపూర్ణశాంభవి
వైశ్యులబిడ్డయై వరలుచుంట
ముజ్జగంబులమూర్తి ముక్కంటిదొరకోరి
వైశ్యవాస్థలి వరలుచుంట
గీ॥ ధర్మసంస్థాపనంబును దలచికీర్తి
కాములైశాంతభావంబు గలిగిజగతి
మేటిసిరిసంపదలతోడ మీరుచుంట
గాదెవైశ్యులభాగ్యమీ కలియుగమున!

ఇంక మాకార్యమీ కలియుగోద్ధరణమున బరిసమాప్తియైనది. గుప్తవంశమున ధర్మమాచంద్రతారకముగా నుండునట్లే పరమేశ్వరీవిలాసమే కారణమై మార్గదర్శియైనది మేమందరమిప్పుడే, ఈయగ్నిప్రవేశనెపంబున నవతారంబులఁజాలించి యేగవలయు (పరికించి) అదిగో! నాతనయుఁడునారదుఁడు నన్ను వెదకికొనుచు వచ్చుచున్నాఁడు శంకరదర్శనమైనది. ఇకనన్ను జూడవలయునని కాబోలు ఇంచుకచమత్కారము గావించెద.

ప్రవేశము నారద

నార—[నమస్కరించి] తండ్రీ! నమస్కారము.

భాస్క—ఏమునీకీపోగరు. నీవు మాపురమునందు బిచ్చగానివలెనుంటివి! బ్రాహ్మణుఁగనుఁ నన్ను తండ్రియని యధిక్షేపించుచున్నావు. నీకునేను తండ్రినా?

నార—కాదు. తండ్రీ.

భాస్క—అదిగో మరల తండ్రియని పిలచెదవు? నేనుబ్రాహ్మణుడను, నీవు బిచ్చగాడవు.

నార—పుత్రకృతమన్నే, తండ్రీ.

భాస్క—మరల తండ్రియా? చాలుచాలు పొమ్ము.

నార— నిజము కాని

భాస్క—కాని లేదు దమ్మిడీ లేదు. పిడికెడు పిలక గలిగిన బిచ్చగాడవు నీవు. గుప్పెడు యజ్ఞోపవీతములున్న బ్రాహ్మణుడను నేను. పొమ్ము పొమ్ము.

నార—(తనలో) నన్నీ మహామహామహులు బరీక్షించుచున్నాడు కదా? (ప్రకాశముగా) నేను త్రిలోక సంచారినగు నారదుడను నీవు సృష్టికర్తవని తెలిసికొని...

భాస్క—నీ కేమైన మతియున్నదా లేక పిచ్చిబట్టినదా? నీవు త్రేతాయుగములోని నారదుడవా? లేక కలియుగ నారదుడవా? నేను సృష్టికర్తనా? నీవు నాకు పుత్రుడవా? నేను నీకు తండ్రినా? చాలు వాడవాడల తిరిపె మెత్తుకొని జీవించు వేషధారివి నీవు. వైశ్య గురుడను నేను. నన్నధిక్షేపించుచున్నావా? నాతో నీకేమి పని పొమ్ము. (పోబోవును]

నార—(కాళ్లమైబడి) నీవేనా తండ్రివగు ధాతవు. నీ పాదములను విడువను నన్ను కృతార్థుని జేయుము.

చ. జగము లన్నిటి న్దిరిగి

చాల గ్రసించితి నయ్య గానిమి

మ్ము గనగలేక దుఃఖమున

మున్గి తపించితినయ్య యింకనై

గరుణను బూనుమయ్య నిను

నమ్మితినయ్య భవత్తనూజు, నిం

తగ పరివేదనం బిడగ

ధర్మమటయ్య! అనుగ్రహింపుమా.

భాస్క—[తనలో] పాపమీ నారదుడు మాయునికి కనుగొన జాలక పరితపించుచున్నాడు. కొంత శాంతి పరచెద. (ప్రకాశముగా) నారదా! లెమ్ము. ఊరక చమత్కారము గావించితి నీవు సకల జగంబులను తిరుగుటయుం శంకరు గనుగొనుటయు, ఆభగవానుడు నిన్నా దగ్గరకు బుత్తెంచుటయు నే నెఱుగక పోలేదు రమ్ము పోవలయు. నా కింకను బనియున్నది.

నార—తండ్రీ! మీ యవతార విరామము లెప్పుడు?

భాస్క—ఇప్పుడే. శంకరాలయమున, అగ్నిగుండ ప్రవేశమైన తోడనే, మే మంతరమరుగు దెంతుము. అచటికే ముందుగా నే నేగుచున్నాను.

నార— ఈ సందర్భములో నాకుకొన్ని సందేహములున్నవి. అడుగవచ్చు నన్నచో నడిగి, సంశయ నివృత్తి గావించు కొనెద.

భాస్క—అడుగుము.

నార—శాంకరి యిన్ని కష్టముల నేల పొందవలయు?

భాస్క—ఆమె స్వయముగా నీకష్టములన్నిటి గోరుకొనియే, అనుభవింపుచున్నది ఇన్ని కష్టముల నీమె బడనిచో నీవృత్తాంతమా చంద్రార్కముగా లోకమున దెలియుటయు, ఎన్నికష్టములు బడినైనను ధర్మ సంస్థానము చేయవలయు ననెడినీతి లోకము నేర్చుటయు దటస్థింపదు. అందులకే సర్వ సమర్థురాలయ్యు, లోకము కొరకీ కష్టముల నామె నొందుచున్నది.

నార—శాంకరివంటి మహామహిమోత్త నరికట్టి, కష్టములు బెట్టుట కా సామాన్యుడగు విష్ణువర్ధనున కేమి కారణము కల్గెంది?

భాస్క— ఆ రాజు సామాన్యుడు కాడు. పూర్వజన్మమున చిత్రకంఠాభిధేయుండగు గంధర్వ రాజు. పూర్వజన్మముం నాతడొక బాలికను ప్రేమించి, ఆమెచే తిరస్కరింపబడి, శపింపబడెను. అందుచే నాతనికీ మానవజన్మ కలిగినది. చిత్రకంఠుడా శాపమునకువెరచి, శాప

విమోచనం బెట్టగుదని; యీ బాలికను బ్రార్థింప, గిరిజ వైశ్యకులము నుద్ధరింప జన్మించుననియు, ఆమెను పలుపాటుల బెట్టి, ఆమెచే శాప విముక్తుడగుననియు నామె పలికె అంతట నా చిత్రకంఠుడే యీ విష్ణు వర్ధనుడై జన్మించె. నారదా! ఆలశ్యమగుచున్నది రమ్ము.

నార— ధన్యుడ.

(ఇరువురు నిష్క్రమింతురు)

రెండవ రంగము: నగరేశ్వరాలయము అగ్నిగుండము.

వైశ్యులాలయము నలంకరించు చుందురు.

భాస— నారదా! నీవా చాటుననుండి చిత్రముల నరయు చుండుము.

నార—చిత్తమట్లే. (ఒకమూల కూర్చుండును)

ప్రవేశము: కన్యక: కుసుమ: విశ్వగుప్త:

మరికొందరు వైశ్యులు.

కుసు—[విచారముతో) కటకటా! నే నెంతటి మందభాగ్యుడ నైతిని. హా విధీ!

చ. కులము నశింపగా నను గు

కూతురు నా యెదుటన్ మహాగ్నికి

లలబడ జేసి ప్రాణముల

లాగగ నెంచితి వేల నయ్యయో!

కలకల లాడు మమ్ములను

గాంచి సహింపగ లేవా? లేక నీ

కలియుగ ధర్మమీ గతిని

కల్పన జేసితివా హహా! దుర్విధీ!

గీ. ధర్మమే జీవనములుగాగ దలచినాము

ధర్మ సంరక్షణా సంవిధాన మేము

హస్తగంబని యాత్మలో నలరినాము
గద ! యికేలర మాకు నీ, కష్టసమితి!.

[కన్యకంజూచి) హా! కూతురా! నీకు నూరేండ్లీనాటితో నిండెనా? అయ్యయ్యో !

సీ. అల్లారుముద్దుగా నాటపాటలు నేర్వ
ధన్యుఁడనంచు నే దలచుచుంటి
భువిని వైశ్యరాణివై పొలుపారనినుజూచి
మోదంబుతో నేను మురియుచుంటి
ముద్దులపట్టివై మొనసియల్లుని జేరి
సుఖియింతువని నేను జూచుచుంటి
మహిళాలలామవై మనకులంబున కెల్ల
యశముకూర్తువటంచు యలరుచుంటి
గీ. గాని కూతుర నాకన్న కడుపు చిచ్చు
పెట్టి నాకంటియెదుట నే వెడలెదంచు
యెరుగనైతిని నీకునూరేండ్లు నేడె
గడచెనంచెంచనైతినా కన్నపుత్రి.

కన్య—జనకా! ఎల దుఃఖించెదవు?

గీ. బ్రతికిరన్నాళ్లు భూమిని భాగ్యముంచు
సతులు సుతులంచు వ్యామోహ సాగరమున
మునుగుచుందురు ఇంతైన ముక్తికలదె!
తనువులిలశాశ్వతంబులె తండ్రిమనకు.
ఆ. వె. వగవనేల? వెంట బడిరావు యీతుచ్ఛ
మైనయైహికములు యశముదక్క
యశముపీడిజగతి యైహికసుఖముల
మునుగతగునె? యశము ముక్తికాదె.

కావున తండ్రీ! విచారంబుడిగి సంతోషంబున కార్యంబునకు గడంగుము.

కుసు—(తనలో) ఆహా! ఏమియీ వింత! ఈపట్టి వచనామృత ముగోలి నాకమితోత్సాహము గల్గుచున్నది.

భాస్క—కుసుమగుప్తా! ఇది విధివిధానము. దీనినిదాటనేరికిని శక్యముగాదు. విచారించుటకు వ్యవధిలేదు.

కన్య—వైశ్యప్రముఖులారా! మీ 102 గోత్రములవారును కృతనిశ్చయులై యున్నవారలా?

విశ్వ—ఆహా! త్రికరణశుద్ధిగా నున్నారము.

కన్య—ఆచార్యా! ఇక వీరలకరంబులకు మీరు వీరకంకణంబు లధరింపజేయుడు

భాస్క—(కంకణములులుముట్టికొని] వైశ్యులారా!

గీ. పౌరుషంబున గుప్తులు ప్రముఖులనుచు
యశమునార్జింపగామీకె యలవియనుచు
ధర్మసంరక్షకులమంచు ధరణిదెలుప
వీరకంకణములబూన వెడలుడయ్య.

1 వైశ్య—గురువర్యా! నాకుముందుధరింపజేయుడు. నేనేవీరలం దరికి మార్గదర్శకుడ నయ్యెదను.

2 వైశ్య—గురువర్యా! నాకు—

3 వైశ్య—నేనుముందుగా

విశ్వ—[కోపముతో) ఛీ! దూరముగా నుండుడు.

ఉ. ఇంతటి గుప్తనాయకుల
నెల్ల దలంపక మీరలీక్రియన్
వంతములాడుకొంచు గురు
పజ్జకుజేరుదురేల? చాలు; మీ

యంతటివారు లేరిటన
టంచు తలంచిరో! నేను లేను మీ
చెంతనటంచు నెంచితిరో!
ఛీ విటులార! తొలంగుడియ్యెడన్!

గురువరా! నాకేముందుగా వీరకంకణముల ధరింపజేయుడు.

కుసు—

గీ. తాళుమిక విశ్వగుప్త యీ తగవు లేల
సకలవిటకోటికే నధీశ్వరుడనైతి
గాన మునుముందుగా నేనె బూనవలయు
వీరకంకణ ధారణ వృత్తి నేడు

[చేయిచాచి]

గీ. గురువరుడ! సందియంబేల గుప్తవంశ
ధర్మతత్వంబులకు నేనె దారిజూప
తర లెదను. వీరకంకణ ధారణంబు
జేయుడీమార్గదర్మకు జేతులకును.

[అందరు కంకణముల ధరింతురు.]
ప్రవేశము: కరంటకుడు పరుగిడుచు,

కరం—ఈ యాగడమేమి? ఈ మాయయేమి? ఈ సాహసము నకు బూనినవారెవ్వరు?

విశ్వ—ఇది వివాహము. ఈమాయ ఈశ్వరమాయ. ఈసాహసమునకు మేమే పూనితిమి.

కరం—ఏమా పొగరు? పిరికిపందలగు మీకీసాహస మెక్కడనుండి వచ్చినది.

విశ్వ—తెలివితక్కువకూతలు కూయకుము నోటికి బుద్ధిచెప్పెదను. అప్పుడే మాకీసాహసమెక్కడిదో నీకు తెలియగలదు.

కరం—మా సేనలన్నియు మీపురమును చుట్టుముట్టినవి తెలి యునా? మామహారాజుగారు మంగళవేషధారులై యరుదెంచు చున్నారు.

విశ్వా—రానిమ్ము. మీమహారాజుగారి కిచ్చట పెద్దపెళ్ళిగా వించెదను

కరం—అట్లయిన మారాజును మోసముజేసి యీమాయావి వాహమును జేయుచున్నారా! చూచుకొనుడు మీపాట్లిక.

విశ్వా—ఊరక వదరక పొమ్ము.

కరం—పోయెదను కాచికొమ్ము. (ఆలయములోని యలంకా రముల పాడుచేయును]

విశ్వా—ఛీ! దుష్టాత్మా! నీయీదౌష్ట్యమునకు ఫలము జూడుము

(యుద్ధము కరంటకుడు మరణించును.)

భాస్క—కుసుమగుప్తా! రమ్ము. కన్యకా! వేగిరపడుము. రాజ రుదెంచులోపున యీవివాహము జరుగవలెను.

(శంకరుమెడలో పూలహారము వేయించును.

కన్య—ఇప్పటికి నేకృతార్థురాలనైతిని వైశ్యరత్నములారా!

గీ. జీవములుపోవునని మది చింతసేతు
రేని వెంటనె యిండ్లకు నేగుడయ్య!
చిరతరస్థాయిగాకీర్తి వరలనెంతు
రేని భండనమును జేయ బూనుడయ్య.

అంద—అమ్మా! మేమందరమును సర్వసిద్ధులమై యున్నారము

కన్య—సంతోషము. గుప్తశేఖరులారా నామనోహరుడు నాకు లభించె. నాకు పరమానందమైనది. ఇంతకంటె నాజీవితమున వాంఛిత మేదియు లేదు. ఇంక నాప్రాణేశ్వరుండగు సదాశివుజేరవలసియున్నది. నేనీయగ్నిగుండమున బ్రవేశించి, నాభర్తృ సన్నిధానమున కరిగెదను!

ఇంక మీ 102 గోత్రములవారలో మీవంశములన్నియు నాచంద్ర తారార్కముగా యశోవంతములై వర్ధిల్లుగాక! కులాచారంబును లంఘించిన యీ యార్నూట పండ్రెండు వంశములవారిని దూరంబుగా బారద్రోలి, వారలతో నేవిధమగు సంబంధబాంధవ్యమును మీరు సలుపకుందురుగాక! మీరు పార్వతీపరమేశ్వరుల సదా సేవజేయుచు కీర్తికాములై వర్ధిల్లెదరుగాక! జనకా! నాకిః శెలవు [నమస్కరించిలేచి] జయ్! జయ్! శంకర్ —

కుసు—(ఉన్మాదముతో) వలదు వలదు నన్నుకూడ గొంపొమ్ము. నీమరణము నేగాంచలేను. ఇదిగో నీకు మార్గము సరిగానున్నదో లేదో నేనే చూచెద విశ్వగుప్తా! భారమంతయు నీది. [గుండమునబడును]

వైశ్యులు—హా ప్రతినిధీ! నీయట్టివానిని విడచి మేముండగలమా! మేముకూడ నిన్నే యనుసరించి స్వామిభక్తితత్పరుల మయ్యెదము.

(గుండమునబడుదురు)

తెరలో.

గీ. తేనెలొలికెడు మాటల తృప్తిబరచి
మోసమును జేయనెంచిరే మూర్ఖులార!
ఎవ్వరడ్డమువత్తురో యింక బల్కి
కన్యకనుబట్టి గొంపోదు గాచికొనుడు

కన్య—విశ్వగుప్తా! రాజు తీవ్రకోపంబున నరుదెంచుచున్నవాడు. నీవప్రమత్తుండవై యుండుము. నేనగ్నిం బ్రవేశించెద.

(ప్రవేశము. విష్ణువర్ధనుడు పద్యముచదువుచు)

విష్ణు—ఏమే! మొండిపిల్లా! నీవిప్పుడెచటికేగగలవు!

[కన్యను బట్టుకొనబోవును.]

విశ్వ—[కోపముతో] గాచికొమ్మిక నీయధర్మవర్తనకుఫలము.

(యుద్ధము. విశ్వగుప్తుడు పడిపోవును.)

విష్ణు—ఇప్పుడు నీకు దిక్కెవరు? (కన్యకను మరల బట్టికొని అగ్నిదరినుండిలాగును.)

నార—ఏమి దిక్కులేరా? తండ్రి! చూచెదవేమి? శాంకరి నుద్ధరింపుము. ఓరీ నేనున్నాడరా!

(తంబురతో రాజునుకొట్టబోవును.)

భాస్క—(వారించుచు) వలదు. వలదు

కన్య—హా! మనోహరా! నేనే మహాపతివ్రతనైతినేని, నా భర్త యీదుర్మార్గుని తనత్రిశూలాఘాతనముచే నంతమొందించుగాక!

(శివలింగమునుండి శంకరుడు ప్రత్యక్షమై త్రిశూలముచే విష్ణువర్ధనుని పొడిచివేయును. రాజుమరణించును.)

కన్య—(అగ్నివేదికనెక్కి) ఓవైశ్యశేఖరులారా!

గీ. నేను సౌందర్యవతినౌట నిరతకష్ట
ములనుపొందితి గాన మీ కులమునందు
సతులు సౌందర్యమును బాసి జగతి కష్ట
ములతొలంగి సుఖంబునొందుదురుగాక!-

జయ్! జయ్! జయ్! శంకర్ భగవాన్!-

(అగ్నిలోబడును.)

నార—[నృత్యము చేయును]

భాస్క—[వారించి] ఆగుమింకను కొంతపనియున్నది ఈవిశ్వగుప్తుని సజీవునిగా నొనరించి వైశ్యవంశమును వర్ధిల్లజేయవలెను. (విశ్వగుప్తునిపై మంత్రోదకముచల్లును)

చును.డులేప్తు [విశ్వగు]

(విశ్వగుప్తుడు లేచును.)

భాస్క:- విశ్వగుప్తా! నీపూర్వపుణ్యవిశేషమున పునర్జీవితుండవై మమ్ముల చూడగంటివి. ఈతడు నారదుడు, నేనే బ్రహ్మను. నీవింకను కొంతకాల మీనైశ్యనాయకుండవై, వారలకు ధర్మంబుల నుపదేశించి, పిదప కైలాసమునకు రమ్ము. మరియు చూడుము నీభాగ్యము.

(అగ్నిగుండమునుండి-ఈశ్వరుడు, పార్వతి, ప్రమదులు, బయటి కరుదెంతురు. విష్ణువర్ధనుడు గంధర్వరూపము దాల్చును.)

అందరు. జయ్! జయ్! శంకర్!

సమాప్తము.

మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ వేమన గ్రంథాలయము,
రేపల్లె.



# అనుబంధములు.

కన్యక 1 వ పుట ప్రవేశము.

1 ఎంతో పరాభవించె । నేమిసేయుదు ॥ఎంతో॥
స్వాంతమునను యోచింపక। సాహసంబున ॥ఎంతో॥
ఆవనమున నన్నొంటిగగనుగొని । జెనకదలచినా । సన్నిధిచేరితా ।
పరుషభాషణములాడుచు మమునతి । మహానిరసనమును
గాంచితా ॥నెంతో॥

2 కన్యక 2 వ పుట 17 వ పంక్తి

శంకరా నను బ్రోవగరావా శంకరా । శివశంకరా । నామనోహరా
బ్రోవగరావా శంకరా ॥శంక॥
జన్మించినదాది యైహికంబుల । సరవివిడచి నీచరణంబులనే ।
ప్రేమించిమదిగ కొలుచుచున్నను । కావగలేవా । బ్రోవగరావా
॥శంకరా॥

3 కుసుమ గుప్తుడు 6 వ పుట ప్రవేశము.

సత్యధర్మమెటనో...నశించె । జగతిని వైశ్యసం । జాతులలోన ॥సత్య॥
వైశ్యమతధర్మ। పథమేపోయె। నిగమాగమముల్ । మరచిరిగా ॥సత్య॥

4 కుసుమగుప్తుడు 7 వ పుట 11 వ పంక్తి.

శోకంబు నొందగనేలా ఇటు ॥శో॥
ఎవ్వడేమి యపచారమొంచెనో । యెరుగబలుకవేల నాకుపుత్రీ ॥శో॥
ఎన్నడైననేతెంచిన నను గని । ఎదురుగ్గజని మదినించుప్రియంబున।
తండ్రీ తండ్రియంచు నన్నుముద్దుల । బిలచుతనయవీవు
భూమిపై బడి ॥శో॥

5 జైలాగు [కుసుమ—కన్యక] 8 వ పుట 4 పంక్తిచివర.

కుసుమ:—తనయా యీపరి । తాపముదెలుపగ । మదిసంశ
యమును । బాయవదే—లా ॥త॥

ఎందుకింత దుఃఖాబ్ధిమునుగ । డెందములోన నీ । కొందలంబు
వినువుమమ్మ యికనాకన్నపుత్రినే భరియింతునె నా ॥త॥

ధర్మంబును రోచింపకనీ । ప్రాణంబులవీడగనేల । ధర్మవిరుద్ధంబని
నేవ్యర్థుడ । నన్నబాయుముమ్మ యసువులను నా ॥త॥

కన్యక:—జనకా నేవచియించినఫలమేమి । పగతుడుకడుబల ।
వంతుడగుటనా। పరిభవాసలము సహియింపకనా। ప్రాణత్యాగము ।
నెంచితి తండ్రీ ॥తనయ॥

6 కన్యక 9 వ పుట 14 వ పంక్తి చివర

జనకా । నామనవినింతయైతను తావినక । పరవనితనంచుబలుక ।
మదికనలుచు కనునలుక । నను జెనక । నతిదుడుకున ననుజేర
నెంచెగా ॥జనకా॥

అన్యకులమునందున జ । న్మించితిననిబలుక । అభిమానవతినటన్నను
నీ । యతివనుజెనక । రయమున । కడుబలవంతుఁడనటంచు ।
కన్నులుగనక । మనవినివినకా । రాజగుకా । వరమునతా । నను
వడికా । మించెనుహో ॥జనకా॥

7 విష్ణువర్ధనుఁడు 16 వ పుట 5 వ పంక్తి

కనుగానక కను । నొడలిమదము పొగలగనిటు । తెగువ । నగను ।
లగప । డకను । పొగరున మనెదో ॥కను॥

వెరతునవిదలించితో । దురమును మదినెంచితో ॥కను॥

8 విష్ణువర్ధనుఁడు 18 వ పుట ప్రవేశము.

విరహాజలధినే తరింపజాలనింక బాల ॥విరహా॥

విరిసుమశరతాపమునే సైపగజాల । బాల॥ విరహా॥

ఆవనమునవిరిసుమములు। అల్లనల్లగోయుచుండ। అతివానీహొయలు గాంచ । హాయినించెగా ॥విరహా॥

రమణీరమణీయమైన । రత్నకంకణములువిరాఱ । సొగసుగనీమృదుల కరము । చురియబట్టగా । నీశృంగారవిలాసము । నీయొయ్యారముల సొంపు । నీదగుసాహసమునునే । నెలతిచురునజాలనాహా ॥విరహా॥

9 కన్యక 24 వ పుట ప్రవేశము.

జగదీశ। పావనా । ప్రభూ । సర్వేశ । శంకరా। హరా ॥జగ॥

నిరతంబునెమ్మదిఁ స్మరింతు। దురితహరము । నోహరా ॥జగ॥

10 కన్యక 26 పుట ప్రవేశము.

జాలిలేదా । శంకరా । మనోహరా ॥జాలి॥

చిన్ననాటనుండియుఁ । నిన్నెమదిగోరితిఁ । యిన్నికష్టములీగతిన్। నన్నుబెట్టగన్యాయమా ॥జాలి॥

11 కన్యక 37 వ పుట 16 వ పంక్తిచివర

నుబ్రోవ। వేగమెరావా । యిక్కనైననను । శంకరా ॥నను॥

కోపమేల। నను। కావగరావ। నినునమ్మితినాథా । శంకరా ॥నను॥

12 శంకరుఁడు 37 పుట 18 వ పంక్తిచివర

నామహిమల్ కనుగొనగా । జగతినియేజనులకువశమా ॥నా॥

సర్వాంతర్యామినియగుటఁ । జనులెరుగకకడు । చెడుదురుగా ॥నా॥

13 విష్ణువర్ధనుఁడు 41 వ పుట నిష్క్రమణ.

ఎంతటిదురహంకార । మెంతటిరాజద్రోహ మెంతసాహసవిధాన । మింతఘోరమహా । అహో ॥ఎంత॥

నా మెదగనుగొనగ నింత ద్రోహచింతయా । అహా నన్ను గాంచ కనుదారుణభావమింతయా । మహాధీరుడనను గాంచ నింత మదిని వంతయా । యీవైశ్యసంజాతను నేబడ యజాలనా । యీ మొయ్యాగి ఘోరసాహసమును మీరజాలనా। అహా ॥ఎంత॥

4. నారదుడు. 42 వ పుట ప్రవేశము.

ఎందుడాగినారో । యెందుల కేగినారో । ఓ దైవములార । ఎందుల కేగినారో । మనుమ్యూర్తులార । ఎందుల కేగినారో ॥ఎందు॥

ఏమికారణమో । ఎంతటి పరిశయమో । యీగతి మీరంతర్ధానం బయి । ఈనారదు సద్భక్తు విడచివీని । జీవనా— ధారము । శోకా నల్ —పాడియే ॥ఎందుల॥

15 కన్యక. 44వ పుట ప్రవేశము

రాజ్యాపతి । గాణవిమువనేడె । నశింపడే। అన్యభామగోర ॥రాజ్యా॥

గుప్తకుల । భామశౌర్యమేమో । యెరుంగక । నన్ను దరియనెంచ నశింపడె ॥రాజ్యాపతి॥

పౌరుసమె । భాగ్యమంచు మదని । దలచుని । వాసవినెదగోర । మదాంధతి । వాసవినెదగోర । నశింపడె ॥రాజ్యా॥

16 నారదుడు 46వ పుట 13వ పంక్తిచివర.

ఆనందమయ్యెడిన్ । నాడెందమందుంగ । నాయందు మోళ్ళనే । నిందుచూడగన్ ॥ఆనంద॥

గంగామనోహరున్ । శృంగారహారునిన్ । భృంగీశ పాలకున్ । రంగారగాంచగన్ ॥ఆనంద॥

17. నారదుడు. 46 పేజీ చివర.

హరహరశంకర । గిరిజమనోహర । బ్రోవరావదేల । శంకర ॥హర॥

నినునమ్మిన భ । క్తునిట్లనాదర । భావంబున విడినాడ న్యాయమా ॥హర॥

ఈవైశ్యాంగన । జేయునంతపు । న్యాయంబేనొనరింపనంచునెంచితో ।
దివ్యదర్శనం బొసంగకనునీ । భర్తుమరువభాగ్యమగునె భవహర
॥హర॥

18. నారదుండు. 47వ పుట 5వ పంక్తిదివర.

ధన్యతముడ। ధన్యుడ । ధన్యుడ। కదు। జగదీశ్వరునేకనుగొంటినేను
కదు ॥ధన్య॥
సకలలోకములు । తిరుగవెడలినను । జాడతెలియరాకపరితపించితి ।
దేవదేవు కనులారగంటినా । శ్రమఫలించె జన్మముతరించె । కదు॥
ధన్య॥

19. నారదుండు. 71వ పుట ప్రవేశము.

నీవె నాజనకుడవు విధాతవు । నిగమాగమమూర్తివి ॥నీవె॥
సర్వజగంబుల । చరియించితినీ । జాడతెలియకయ్యో పరితపించితి
॥నీవె॥

20. నారదుండు. 74వ పుట 5వ పంక్తి.

కృతార్థుడనై తిగా నా । దైవములనుగాంచితిన్ ॥కృ॥
సదాశివున్ । విధాతనా । యుదార శ్రీహరిన్ । గనన్ ॥కృ॥

21 కుసుమగుప్తుడు. 74 పుట ప్రవేశము.

హా । హా । విధీ । నీ । యూశ్రితులమను లగాసిలజేయుగ శ్రే
యమా ॥హా॥
ఏపాపము నెరుగనిదీనుడను। నాతనయుర్ । నాయెదుటనేమహాగ్ని।
లోపడజేసి। దిక్కుమాలినవానిజేసెదవా। హా। హా। హా। హా॥హా॥

22. అందరు. 78వ పుట 15వ పంక్తిచివర.

శంకరా। కృపాకరా। జయ్। హరా। శివా। మనోహరా ॥శం॥

కరుణా। కరా। మహాత్మ మ। మ్ములన్ దయగా పాలింపవే ॥శంక॥
ఈవైశ్యభక్త। వరులనీ। కటాక్ష । మునను బ్రోవవేలరా। హరా।
శంకరా॥

23. విష్ణువర్ధనుడు. 80వ పుట 4వ పంక్తిచివర.

ఎచ్చటికేగెదు యింకనిన్ను బల్మినిగ్రహియింతునునీకుదిక్కెవ్వ॥రెచ్చ॥
నన్నుమోసగింప యెవ్వారలకైననుగాని । యీరాజ్యమందు తర
పగునే। యిక। నీ ॥వెచ్చ॥

24 నారదుడు 81వ పుట 20 వ పంక్తి

ఎంతోసంతసమునిండెగా। జగదీశుతెల్ల యవతారములవిదువ॥నెంతో॥
వైకుంఠము భా । స్వంతమయ్యెకై । లాసముభా । గ్యవంత
మయ్యెను । సత్యలోకమునశాంతిగల్గె నీ । నారదునకు
జీవనముదొరకెనే ॥డెంతో॥

25 అందరు 81 వ పుట మంగళం.

కులమెల్లవర్ధిల్లుగాక ధరకన్యకా । పరమేశ్వరీకృపామహిమంబులను।
వైశ్య ॥కుల॥
నిత్యసత్యవిచారనియతులను గల్గి । నిగమాగమాదిశాస్త్రోద్ధతి
పఠించి ।నిరతశాంతివిధానవిశ్చలతతో । వైశ్య ॥కుల॥

శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.





| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105B173 |
| పుస్తకం పేరు | 5ngs |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |